ఓం

# శ్రీ భూమానంద

# వాక్యత్రయము

ఇయ్యది

శ్రీ మద్బ్రహ్మవిద్యావశిష్ఠ అచలబోధ సిద్ధాంత సాంప్రదాయకులగు

శ్రీ భూమానంద

## హనుమంత దేశికేంద్రుల వారిచే
## రచియింపబడి

అచల ఋషి

## శ్రీ దయానంద రాజయోగిగారిచే
## ప్రకటింపబడియె

**8 వ కూర్పు 2000 ప్రతులు**

 1992 వెల : ~~6-00~~

ఓం

# శ్రీ భూమానంద

# వాక్యత్రయము

ఇయ్యది

శ్రీ మద్బృహద్వాశిష్ఠ అచలబోధ సిద్ధాంత సాంప్రదాయకులగు

శ్రీ భూమానంద

## హనుమంత దేశికేంద్రుల వారిచే

## రచియింపబడి

అచల ఋషి

## శ్రీ దయానంద రాజయోగిగారిచే

## ప్రకటింపబడియె

**8 వ కూర్పు 2000 ప్రతులు**

 **1992** వెల : ~~6.00~~

ఓం

శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర గురవేనమః
ద్వయదోష రహిత పరమ తత్త్వము వేదవేదాంత సారతీతము, సకల సుజన మనోరంజిత విలాసము జననమరణ ప్రవాహామును సులభో పాయముగ దాటించదగిన ఆగమ నిగమోపనిషత్సాగర మధితార్థాతీతంబైన యీ

# భూమానంద వాక్యత్రయమను

1. సందేహ నివర్త్యోపన్యాసము
2. పరతత్త్వ ప్రకాశిక కందార్థ దరువులు
3. భ్రాంతి రహిత పరమ తత్త్వములు


శ్రీ భూమానంద
మందిప్పల హనుమంత దేశికేంద్రులచే
రచియుంపబడి


•

శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వర స్వాములవారిచే
సవరింపబడి

ఆచలర్షి


శ్రీ దయానంద పొన్నాలరాజయోగి గారిచే ప్రకటించబడియె

8వ కూర్పు 2000 ప్రతులు.





1992

వెల: ~~5-00~~
7-00

శ్రీ సద్గురుభ్యోనమః

# అవతారిక

సజ్జనులార !

పరిపూర్ణాచలప్రబోధ ప్రతిష్ఠాపనాచార్యులగు శ్రీమద్రాముడగు శివరామ దీక్షితులవారు జననమరణ భ్రాంతి సులభముగా దోలగుటకోర్తై 1.సాందీప వాక్యములును, 2. బృహద్వాశిష్టమును, 3. శివరామ దీక్షితీయము యను యీ మూడు పీఠ గ్రంథములుగా రచించిరి.

శ్రీమద్భాగవత కృష్ణయ్యగారు యీ పీఠ గ్రంథముల యొక్క భావార్థ మును ముముక్షువులకు సులభముగా దెలియునటుల 1. శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణతత్వ కందార్థదర్వులు, 2. క్షరాక్షరోపాధి ద్వయదోష రహిత పరమతత్వ కంద పద్యములు, 3. అధ్యాత్మలు, నిఖిల వేదాంతార్థ నివహంబును ద్వాదశవిధ బోధలు రచియుంచిరి.

ఈ గురుపీఠ గ్రంథములయొక్క అభిప్రాయమును భక్త జనులకు హృద్గోచర మగునటుల 1 మహా అద్వైత సిద్ధాంత పరమతత్వ కందార్థములును, 2. సద్గురు భక్తశతకము, 3. సాంఖ్య తత్వము, 4. వెంకటేశ్వర భావార్థ దోహరలు. శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరవధూత స్వాములవారు రచియంచిరి.

ఇట్టి గ్రంథములలో పునరావృత్తి భ్రమరహిత పరచదగిన అచలబోధ. భ్రాంతి రహిత సాంప్రదాయక నిజగురు స్వాములకు చతుర్విధ శుశ్రూషలుచేసి సంపూర్ణముగా అచలబోధను ఉపదేశము బొంది తిరిగి ఒకరిని పునరావృత్తి భ్రాంతి పుట్టకుండా ఉపదేశమును జేయడమునకు అధికారము చాలనిదే తమతమ ఉహా పోహాలచేత కందార్థముల అర్థమును గ్రహించి, తమ కపటనాటక ప్రసంగ మునకు తగినన్ని శ్లోకములు, పద్యములు, పాఠముచేసి మేమే భ్రాంతి రహిత నిజగురు సాంప్రదాయకులమని తినరాని పదార్థములు దినుచు చేయరాని పనులు చేయుచు సంశయ రహితులమని అనేకులను నమ్మించి తాచెడ్డదేగాక తమ నాశ్రయంచిన వారలను జెరుపుచు విద్వాంసులమని జ్ఞానులమని యింటింట బోగడు కోనుచున్నారు. అందువల్ల

అమాయక ప్రజలు చెడుతున్నారు. వారట్లు చేడకుండ ముముక్షువులకు సులభోపాయముగా బోధపడుటకై సకల మతములవారు మోక్ష భ్రాంతిని వదలి సంశయ రహితులై అచల పరిపూర్ణబోధ వడసి కృతార్థులగుట కొరకు శ్రీ భూమానంద మందిప్పల హనుమంత రాజయోగిగారు భూమానంద వాక్యత్రయమను 1. ఈ సందేహ నివర్త్యోపన్యాసము, పరతత్వ ప్రకాశిక కందార్థములు, 3. భ్రాంతి రహిత తత్వములు రచించిరి.

అచల పరిపూర్ణ నిజగురు స్వాములచే విని కని భక్తితో శ్రవణము జేస్తూయుండిన సకల ముముక్షువులు కృతార్థులగుదురను తలంపుతో శ్రీవారి శిష్యుండగు దయానంద పొన్నాల రాజయోగిగారు ముద్రింపించి ప్రకటింపజేసిరి.

ఇది కథగాదు వేద వేదాంత సిద్దాంత విచారణ జనన మరణ వ్యథ మానుటకై ఆగమ నిగమోపనిషత్సాగర మథితార్థాతీతము. తర్క వితర్క పాండిత్య అభిమాన రహితులకు రత్నములు ఇతరులకు రాళ్ళు, అందముగ ఘనులు మెచ్చెదరు. చంద్రుడు ఉదయంబందిన సింధువు చెలరేగును గాని చెరువులు, బావులు, కుంటలు, నదులు చెలరేగవు.

# గమనిక



## -[ పార్వతి ఉవాచ]-

ఉ|| షోడశినాల్గుమార్గములు శోధయొనర్చియు బోధరూపుడై జాడగషోడశీమరియు చక్కనిమంత్రము తాజపించినన్ జూడఫలంబుకద్దు ఎటుజూచినవారలు నిర్మలాత్ములే వేడుకతోడవింటి సురవేత్తలనోటగదే మహాప్రభో ||

### ఈశ్వర ఉవాచ

ఉ|| షోడశినాల్గుమార్గములు శోధయొనర్చిన బోధరూపుడై వీడక నాల్గుద్వాదశులు వేడుకతీరగ తానెరింగినన్ వీడునుకర్మబంధములు వేడ్కమహాత్ముల సేవజేసినన్ పొడిమిజన్మయేల పరిపూర్ణులువారలు విన్ముపార్వతి ||

### శ్రీ సద్గురవేనమః

# అచలర్షి సాంప్రదాయక

## -(నిజగురు పరంపర ధ్యానం)-

ఓం నమో॥బ్రహ్మాదిభ్యో| బ్రహ్మవిద్య సాంప్రదాయ కర్తృభ్యో| వంశఋషిభ్యో | మహాద్భ్యో | నమోగురుభ్యః | సర్వోపప్లవ రహిత ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో | బ్రహ్మైవాపామస్మి అపాం పదార్థ రహితః ||

శ్లో|| ఓంకార పీఠ సిద్ధాంతం | బ్రహ్మవిద్యోపదేశికం
శ్రీమున్నారాయణం సూర్యం | సద్గురుభ్యో నమోనమః

శ్లో || యాజ్ఞవల్క్యంచ జనకం | శుకసాందీప మీశ్వరమ్
కృష్ణమర్జున సంయుక్తం | ఉద్ధవంచ నమోనమః ||

శ్లో || శ్రీధరస్వామియోగీంద్రం | శివరామాఖ్య దీక్షితం
కంబాలూరి అప్పబ్రహ్మం | సద్గురుభ్యో నమోనమః ||

శ్లో || పరశురామ సీతారామ | భాగవత కృష్ణయోగినః
ఫీలుఖాన లక్ష్మణార్య | సద్గురుభ్యో నమోనమః||

శ్లో || బృహద్వాసిష్ఠ సిద్ధాంత | పూర్ణ బోధోపదేశిక
వేంకటేశ్వర యోగీంద్ర | సద్గురుభ్యో నమోనమః ||

శ్లో || వేంకటేశ్వరపాదార| వింద్బామృత రసాయనం
పిబన్మత్త మనోభృంగం | హనుమంతం గురుంభజే ||

శ్లో || వేదశాస్త్ర విధిఖ్యాతం | పూర్ణ బోధోపదేశికం
సుగుణాకరం దయానందం | రాజయార్య గురుంభజే ||

## పరిపూర్ణ అచలధ్యానం

శ్లో|| పూర్ణమేవనిరాలంబం | అగ్నేయే నిర్గుణంతథా
దక్షిణే నిత్యశుద్ధంచ | నైఋత్యే నిరుపద్రవం||
పశ్చిమే నిష్కళంచైవ | వాయవ్యేచనిరంజనం
ఉత్తరేచ నిరాకాశ | మీశాన్యే నిర్మలోభవేత్||
ఊర్ధ్వమేవ నిరాకారం | అధశ్చనిర్వికారకః
అంతర్బహిశ్చ సర్వత్ర | అచలోయం సనాతనః|

## -(పరాపూజ)-

శ్లో|| పూర్ణస్యావాహనం కుత్ర | సర్వాధారస్యచాసనం
స్వచ్ఛస్య పాద్యమర్ఘ్యంచ | శుద్ధస్యాచమనం కుతః ||

శ్లో|| నిర్మలస్యకుతస్స్నానం | వస్త్రం విశ్వోదరస్యచ
నిరాలంబ స్యోపవీతం | రామస్యాభరణం కుతః

శ్లో|| నిర్లేపస్య కుతో గంధం | పుష్పం నిర్వాసనస్యచ
నిర్గంధస్య కుతోధూప | స్వప్రకాశస్య దీపకం ||

శ్లో|| నిత్యతృప్తస్య నైవేద్యం | నిష్కామస్య ఫలంకుతః
తాంబూలంచ విభోకుత్ర | నిత్యానందస్య దక్షిణా ||

శ్లో|| స్వయం ప్రకాశ మానస్య | కుతో నీరాజనాదికం
ప్రదక్షిణ మనంతస్య | అద్వితీయస్యకాస్తుతిః ||

శ్లో|| అంతర్బహిశ్చ పూర్ణస్య | కథముద్వాసనం భవేత్
ఇయమేవ పరాపూజా | సర్వావస్థాసు సర్వదా ||

శ్లో|| ప్రేమబుధ్యాతు సర్వేశే | మనోదేవే నివేశయేత్
ఏషా మజ్ఞానజీవానాం | సమస్తారిష్ట శాంతయే |
యద్యబోధ్ధవ్య మఖిలం | తత్తద్భక్త్యా బ్రవీమ్యహం ||

## ద్వాదశాక్షరి

అస్యశ్రీ ద్వాదశాక్షరీ మహామంత్రస్య | అచలఋషిః | అవినాశఃఛందః అభవో దేవతా | అమృతం బీజం | అప్రమేయశక్తిః | అయమాత్మ తత్వమస్యాది | జ్ఞానరహిత కీలకం | అఖిల కాలేషు పరిపూర్ణ మస్తి | మాయాసహిత

మేతత్ప్రపంచం | నా స్తీతి నిశ్చయ సిద్ధ్యర్థం | ద్వాదశాక్షరీ మహా మంత్ర జపం కరిష్యే ||

## అథకరన్యాసః

ఏతన్మిథ్యా - అంగుష్ఠాభ్యాంనమః | శుద్ధవియత్ - తర్జనీభ్యాంనమః | కించిన్నాస్తి - మధ్యమాభ్యాంనమః | ఏతన్మిథ్యా | అనామి కాభ్యాంనమః | శుద్ధ వియత్ - కనిష్ఠికాభ్యాంనమః | కించిన్నాస్తి | కరతల కర పృష్ఠాభ్యాం నమః ||

## అథహృదయాది న్యాసః

ఏతన్మిథ్యా - హృదయాయనమః | శుద్ధవియత్ - శిరసేస్వాహా | కించిన్నాస్తి - శిఖాయైవషట్ | ఏతన్మిథ్యా - కవచాయహుం | శుద్ధవియత్ -నేత్రత్రయాయ వౌషట్ | కించిన్నాస్తి - అస్త్రాయఫట్ | ద్రష్టదర్శన దృశ్యాదిసహిత|అహంపదార్థరహితఃభూర్భువస్సువరోమితిదశదిగ్బంధః||

## అథధ్యానం

శ్లో|| అచలమఖిలం చాద్యం | సర్వలోకేషు పూర్ణం
సర్వాతీతం | స్వానుభూతానగమ్యం
సర్వాబాధ్యం | సర్వ కర్తృత్వ శూన్యం
సర్వావేద్యం సర్వ రహితం నమామి ||

శ్లో|| అవాచ్యం హ్యఖండం | హ్యలక్ష్యం హ్యబాధ్యం
హ్యసంగం హ్యవేద్యం | హ్యచింత్యం హ్యరూపం
హ్యసాధ్యం హ్యనాదం | హ్యతీతం హ్యనంతం
హ్యశుద్ధం హ్యబుద్ధం | హ్యనామం నమామి ||

శ్లో|| మృత్యుజన్మ భయదుఃఖవర్జితం | సర్వదృశ్య దృగ్ద్రష్టృనాశనం
అప్రతర్క్య మమలం నిరామయం | అనుపమాన మచలం
నమామ్యహం |

శ్లో|| నిత్యపూర్ణాయ సత్యాయ | నిశ్చలాయ నిరీహిణే
నిర్మలాత్మ స్వరూపాయ | నిర్గుణాయ నమోనమః ||

శ్లో|| ఏతన్మిథ్యా శుద్ధవియత్ | కించిన్నాస్తీతితేమయా
కృపయా పరమం ప్రోక్తం | భజాగ్రే ద్వాదశాక్షరం ||

## అథమనుః

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏతత్ | మిథ్యా | శుద్ధ | వియత్ | కించి | న్నాస్తి |
| ఈ | వుత్త | బట్ట | బయలు | ఏమి | లేదు. |

## షోడశాక్షరి

అస్యశ్రీ షోడశాక్షరి మహామంత్రస్య | నిరంజన ఋషిః నిరహంకార ఛందః | నిరామయనిరాకాశో దేవతా | నిరావరణ బీజం | నిస్త్రె గుణ్యశక్తిః | నిర్గుణ ప్రజ్ఞాన రహిత కీలకం | నిఖిల కాలేషమాయా సహిత భూతపంచక నిర్మిత, దశేంద్రియ పంచప్రాణ మనోబుద్ధి సహిత, సూక్ష్మ శరీర రహిత, సిద్ధ్యర్థం. షోడశాక్షరి మహా మంత్ర జపం కరిష్యే ||

## అథకరన్యాసః

నిర్మూలం - అంగుష్ఠాభ్యాంనమః | ఏతత్ - తర్జనీభ్యాం నమః | జ్ఞానాచ్ఛరీరం | మధ్యమాభ్యాం నమః | నాస్తి - అనామికాభ్యాం నమః | కేవలం కనిష్ఠికాభ్యాం నమః | నిర్మూలమే తథాజ్ఞానాచ్ఛరీరం నాస్తి కేవలం కరతల కరపృష్ఠాభ్యాం నమః ||

## అథహృదయాదిన్యాసః

నిర్మూలం - హృదయాయనమః ఏతత్ - శిరసేస్వాహా | జ్ఞానచ్ఛరీరం | శిఖాయైవషట్ | నాస్తి - కవచాయహుం | కేవలం - నేత్రత్రయాయవౌషట్ || నిర్మూలమే తథాజ్ఞానచ్ఛరీరం నాస్తి కేవలం - అస్త్రాయఫట్ || సమస్త నిర్మోహాయ, త్రైకాలేషమద్రహిత, నిశ్చయో భూర్భువస్సువరోమితి దశదిగ్బంధః ||

## అథధ్యానం

శ్లో|| సర్వనిగమగుహ్యం | శాశ్వతం సర్వకాలం
సకల దివిజవంద్యం | సర్వ దిగ్పూర్ణ మచలం
సకల భయనివారం | సర్వలోకాంతరస్థం
సకల మునిహృదిస్థం | సర్వదేశ ప్రశస్థం ||

శ్లో|| నజ్ఞాతం పరవస్తు రూపరహితం | నిస్తేజ మమృతం సదా
నిశ్శబ్దం నిరుపాసనం నిరుపమం | నిర్దేశ పూర్ణ స్థితం
నిత్యాభ్యాస వివర్జితం విహిత స | ద్వ్యాపార శూన్యం సదా

నిస్సంగం నిరుపాధికం నిరవయం || నిత్య హృదాభావయే|

శ్లో|| ఆనందరహితోస్మి నిత్యమచలం | నిర్ఘాతనిర్ఘోత నిరింద్రియత్వం
నిర్మోహ నిర్ద్వంద్వ నిరూపసత్యం |
మహద్గురుంనియమహంనమామి||

శ్లో|| నిరాలంబాయ నిత్యాయ | నిర్మలాయ నిరంజన
నిత్యశుద్ధాయ బుద్ధాయ | వస్తు మద్రహితం నమః ||

శ్లో|| నిర్మూలమే తథాజ్ఞాన | చ్ఛరీరం నాస్తి కేవలం
షోడాశాక్షరి తత్సిద్ధ | మిదం మస్త్యనిశంభజే ||

అథమనుః

నిర్మూలమే తథా. జ్ఞాన, శ్చరీరం నాస్తి కేవలం,
మూలంలేని యీ గుర్వైరిగే, శరీరం యేమి లేదు.

శ్లో|| ఇతి మంత్ర సమానైవ | సాందీపగుర్వగ్రణి
కృష్ణస్యమస్తకేనస్య | హస్తంతూష్ణిం బభూవహ ||

దృష్టద్రాష్టాంతం

శ్లో|| స్వప్నే ప్రతీయమానాని రూపాణిచయథాతథా
కర్పూర దీప సంయోగం జ్యోతిరూపం యథాతథా ||

దృ|| కలదోచిన శరీరములు యేలాగో అలాగే

ద్రా|| కర్పూరము కళిక కూడితే యేలాగో అలాగే.

శ్రీ సద్గురు చరణార విందార్పణమస్తు

ఓం

శ్రీ సద్గురవేనమః

# సందేహనివర్త్యోపన్యాసము

శ్రీ సద్గురుమూర్తి నిర్హేతుక జాయమాన కటాక్ష వీక్షణమున పరమదయాళుండై, నాకానతిచ్చిన జనన మరణ రహితంబగు మోక్ష

మార్గమునకు సంబంధంబగు గురుబోధ, నేను వినికనిన విచారణకును, ప్రపంచమునందు మోక్షమును గురించి ప్రయత్నించు కొందరి లోకుల విచారణకును, వ్యత్యాస మగుపడినందున, ఆ కొరత దేనియందు కలదోయని విచారణజేయనుత్సాహము గలిగి, ఉపన్యాస రూపముగా విమర్శించ నిశ్చయించుకున్నవాడను.

## అది యెట్లనగా :-

శ్లో|| శాస్త్రదృశ్యం గురుర్వాక్యం | తృతీయం ఆత్మ నిశ్చయం
చతుర్థం సంశయచ్ఛేదం | పంచమం ముక్తి దాయకం ||

శాస్త్ర సమ్మతమును, గురువాక్య సమ్మతముచే నిశ్చయబుద్ధి గలిగి, సంశయ రహితమైనవారికి మోక్షము చేకూరగలదని శ్లోకముయొక్క భావము. శాస్త్రమునకు, గురువాక్యమునకు, అనుభవమునకు, వ్యతిరేకముగాకుండా, యీ మూటి సమ్మతముగా విచారణ చేయవలెనను వుద్దేశ్యము.విచారణకు ముఖ్యాంశము లేవంటే:-

౧ పరమార్థమనగా ఎటువంటిది?

౨ ప్రపంచమనగా ఎటువంటిది?

౩ శాశ్వతమేది అశాశ్వతమేది?

౪ ప్రపంచోద్భవమెట్లు?

౫ పారమార్థమునకు, ప్రపంచమునకు సంబంధము కలదా?

౬ ఈ రెంటిని విచారించు మన మెవ్వరము?

౭ మోక్షమెవ్వరికి?

ఈ సంశయములను చక్కగా విచారించుట ముముక్షువులకు పరమధర్మమై యున్నది గనుక,

## పరమార్థమనగా : -

శ్లో|| యస్యాంతర్నాదిమధ్యం | నహికరచరణం | నామగోత్రం |
నసూత్రం |నోజాతి | ర్నైవవర్ణో | నభవతిపురుషో | నానపుంసో

నచస్త్రీ | నాకారం | నైవికారం | నహిజనన మరణం | నాస్తి పుణ్యం | నపాపం | నోతత్వం | తత్వమేకం సహజ సమరసం | తత్పరమం నమామి ||

శ్లో|| సర్వ శూన్యం మయారూపం | జన్మ శూన్యం స్వభావతః ||

శ్లో|| ఆత్మాతీతం కేవలాత్మ | దేహోనాస్తికదాచన ||

శ్లో|| నిత్యశుద్ధం నిరాభాసం | నిరాకారం నిరంజనం ||

శ్లో|| అవాచ్యం హ్యఖండం హ్యలక్ష్యం హ్యబాధ్యం
హ్యసంగం హ్యవేద్యం | హ్యచింత్యం హ్యరూపం
హ్యసాధ్యం హ్యనాద్యం | హ్యతీతం హ్యనంతం హ్యశుద్ధం
హ్యబుద్ధం | హ్యనామం నమామి ||

శ్లో|| ఆనంద రహితోస్మి | నిత్యమచలం
నిర్ఘాత నిర్ఘోత | నిరింద్రియత్వం
నిర్మోహ నిర్ద్వంద్వ | నిరూప సత్యం
పరాత్పరం | నిత్యమహం నమామి||

శ్లో|| నైనంచిందంతిశస్త్రాణి నైనందహతి పావకః
నచైనం క్లేదయంత్యాపో | నశోషయతిమారుతః||

శ్లో|| నిర్గుణో నిష్క్రియోనిత్యో | నిర్వికల్పో నిరంజనః
నిర్వికారో నిరాకారో | నిత్యముక్తోస్మి నిర్మలః ||
శృతి || క్షరాక్షరాభ్యాం విలక్షణః ||

ఆ పరమార్థము ఆదిమధ్యాంతములు లేనిదనియు, కరచరణా ద్యవయవములు లేనిదనియు, నామము, రూపము, కులము, గోత్రము, సూత్రము లేనిదనియు, పురుష, నపుంసక, స్త్రీవర్ణము, కానిదనియు, ఆకార వికారములు గానిదనియు, జనన మరణములు లేనిదనియు, పాప పుణ్యములు లేనిదనియు, పంచ వింశతి తత్వములు గానిదనియు, తత్వాతీత తత్వమనియు. సహజ సమరసత్వమైనదనియు, పైనగల శ్లోకములయందును శృతులయందును చెప్పబడుచున్నది, ఇదియుగాక.

కం|| సామర్థ్యమేమిజూపదు | కామక్రోధాదికముల | గలయదనికమే
బాములెరుంగదు యితరులు | యేమనినను మారు బల్కదు||

కం|| దానము ధర్మము సగుణ | ధ్యానము ప్రతి మార్చనంబు
తజ్ఞపతీర్థ | స్నానములెన్ని జేసినను మాటలాడదు.

కం|| పలుకున బలుకగరాకను | తలపోయుద మనిన మదికి దగులదు.

కం|| ధ్వని మొదలగు తన్మాత్రలు | గనుగొనగా లేశమైన గాన్పించదు.

కం|| ఇంతంతని యనరానిది | వింతలుసేయ నిదియెన్ని |
విధములగనినన్ చింతలెరుంగనిది | అనియు,

శ్రీ భాగవత కృష్ణదేశిక ప్రభువరులవారు ఆనతిచ్చినారు |

## ప్రపంచ మెట్టిదనగా

మిథ్యాస్వరూపమైనది, నామ, రూప, కుల గోత్ర వర్ణాశ్రమ ధర్మములు గలది, అశాశ్వతమైనది, జనన మరణ ప్రవాహాములకు వునికి పట్టయినది. గనుక, ప్రపంచము అశాశ్వతమనియును, పారమార్థము శాశ్వతమనియును, తేట పడుచున్నది. అయితే ఈ మిథ్యా స్వరూపమైన ప్రపంచము యెట్లు పుట్టినది. ఎవరివలన వచ్చినది. అని విచారించగా, పైన జెప్పబడిన పరమార్థమే కారణ మనుకోవచ్చునా? అయితే ఆ పరమార్థము సంకల్ప వికల్పాది గుణములు లేనిదనియు, జనన మరణములు లేనిదనియు, శృతి, స్మృతి, ఉపనిషద్వాక్యములందు చెప్పబడుచున్నదిగదా!

కం || పుట్టదు గిట్టదు ఒకరిని | పుట్టించదు చంపబోదు | భూమః ఎరుకదా
పుట్టును గిట్టును ఒకరిని | పుట్టించును సమయజేయు | భూమ
కితరమై;

యనియు శ్రీ భాగవతుల కృష్ణదేశికులవారు సెలవిచ్చియున్నారు గనుక, పరమార్థము వలననే ప్రపంచము పుట్టినదనుటకు కేవలం విరుద్ధముగా నున్నది. గాన ప్రపంచము మాయవలన పుట్టి, మాయచేతనే నశించునట్లు దృఢముగా బోధపడుచున్నది. గనుక పారమార్థము శాశ్వితము, ప్రపంచము అశాశ్వితము అని తెలియుచున్నందున.

శృ|| బ్రహ్మ సత్యం జగన్మిథ్య యని సిద్ధాంత వాక్యము.

## మాయ యెవరివలన ఉద్భవించినదనగా :-

గీ|| మాయ దెలియరాదు మాయ మూలములేదు | మాయ
వాయురూపమాయ
మమత | మాయవల్ల బుట్టె మహదహంకారంబు,

కం|| యెరుకోత్పత్తిని దెలియగ | సరసిజ గర్భాదులైన | చాలరనెడిచో
నరుడెంతవాడు, వాడది యెరుగుదునన వట్టిమాట,
యని పెద్దలు చెప్పియున్నారు.

అయితే మాయ పుట్టుక యెంతటివారికిని తెలియదనిన యెడల విచారణకు కొంత కొరత గావచ్చునని ప్రశ్నించవచ్చును. ఈ కొరత సద్గురు మూర్తిచే విడిపోగలదు (యెరుకను విడిపించలేరు యెవ్వరుధాత్రిన్ గురుడొకడుతప్ప) యని శృతివాక్యము కలదు (ఈ సంశయము నీమదినిల్పరాదు, నీవెన్నడు యిది విన లేదు) యనునట్లు సద్గురుని చేరినవారికి మాయ యగు యెరుక పుట్టుక తెలియ గలదు.

## ప్రపంచోద్భవ మెట్లనగా

మాయ త్రిగుణ స్వరూపమై, ఉత్పత్తిస్థితి లయములకు, మూలకారణమై మూడు విధములైనది. సత్వగుణమున శుద్ధమాయ, తమో గుణమున మలినమాయ. రజోగుణమున మిశ్రమ మాయయై, శుద్ధమాయ దేవత్వము, మలినమాయ జడత్వము, మిశ్రమాయ జీవత్వములుగా పరిణమించినది. యెట్లనగా.

శుద్ధమాయ, సత్వగుణ ప్రధానమై బ్రహ్మ, విష్ణు రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు, క్రియాశక్తి. ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి, ఆధిశక్తి పరాశక్తి, స్వర్గము, వైకుంఠము, కైలాసము, పరమపదము, ముక్తి, మోక్షము, లక్ష్మి, సరస్వతి, పార్వతి, లింగస్వరూపము, జ్యోతిస్వరూపము, మంగళస్వరూపము, నిర్గుణ బ్రహ్మ, శ్రియఃపతి, శ్రీమన్నారాయణ యనియు, యింకా అనేక పరియాయ నామములచెత పరిణమించినది.

మలినమాయ, తమోగుణ ప్రధానమై ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి, ప్రకృతి, అవిద్య, అనాత్మ , జడము, అమంగళము, దృశ్య రూపములుగా పరిణమించినది.

శుద్ధమాయ మలినమాయా కలసి, మిశ్రమమాయయై, రజోగుణముచే

ద్వంద్వ స్వరూపమైన ప్రపంచమాయెను. యెట్లనగా, ఆత్మానాత్మ ప్రకృతి పురుషుడు, క్షర మక్షరము, సత్తుచిత్తులు, జడాజడములు, జీవేశులు, నేనుమేనులు, దేహిదేహములు, జ్ఞానాజ్ఞానములు, సత్యాసత్యములు, పాపపుణ్యములు, సుఖదుఃఖములు, ధర్మాధర్మములు, గురువు శిష్యులు, కలిమిలేములు, తలిదండ్రులు, యెరుకమరుపులు, శుక్లశోణితములు, నీరాన్నములు, జనన మ్మరణములు. ఆదిగా గల మానవులు, మృగములు, పక్షులు, జలచరములు, క్రిమికీటకాది జంతు జాలములు, నామరూప, కులగోత్ర వర్ణాశ్రమ ధర్మములుయను యభిమానముగల ప్రపంచమాయెను.

యీ రెంటిని విచారించు మన మెవ్వరము

త్రిగుణ స్వరూపమైన మాయోద్భవమగు సకలోపాదులయందు

శ్లో|| "దుర్లంభం మానుషం దేహం" అనే న్యాయమున దుర్లభమైన మానవోపాదియందు గలవారము. ఇందులో,

1. సత్వగుణ ప్రధానమైన శుద్ధ మాయలోని బ్రహ్మ సృష్టికర్తదైవము యింతకు మించిన దైవము వేరులేదనే అభిమానముగల ద్వైత మతస్థులు.

2. శ్రీ విష్ణువే పాలనజేయువాడు. యింతకుమించిన దైవము లేడనే అభిమానముగల విశిష్టాద్వైత మతస్థులు.

3. బ్రహ్మ, విష్ణు, రుద్రుడు, ఈ ముగ్గురు ఉత్పత్తి స్థితి లయములు జేయువారలు, దైవ స్వరూపులు, వీరికి భేదము లేదు యనే యభిమానముగల అద్వైత మతస్థులు.

4. శివుడే జగత్కారణుడు, మంగళ స్వరూపుడు, లింగ స్వరూపుడు, స్వరం శివ స్వరూపంబనే అభిమానముగల శైవ మతస్థులు.

5. శక్తియే జగత్తునకు కారణ స్వరూపమైనది జగన్మాత జగద్రక్షణియనే అభిమానముగల శాక్తేయ మతస్థులు.

6. సూర్యుడే ప్రత్యక్ష దైవమనే యభిమానముగల సౌర మతస్థులు.

7. సర్వజగత్తుగణస్వరూపమైనది అనగా గుంపులుగుంపులుగా గలది గణములకెల్లను పతి యనగా ప్రభువు గణపతియే దైవమనే అభిమానము గలగాణపత్య మతస్థులు.

8. పంచభూతములే దైవ స్వరూపములని పూజించే జైన మతస్తులు.

9. బుద్ధియే ప్రధానముగా భావించే బౌద్ధ మతస్తులు

10. నదీనదముల ప్రాంతములే నివాస స్థలములుగాగల కుటీచకమతస్తులు.

11. కపాలముచేతబూని భిక్షాన్న భక్షకులై తిరుగు కాపాలిక మతస్తులు.

12. ఖురానునందు అభిమానముగలిగి దేవుడొక్కడేయని నమ్మి పీర్, పైగంబర్, వలీ యను మహాత్ములను గౌరవించుచు జన్నత్ అను మోక్షము నందభిలాషగల మహమ్మదీయ మతస్తులు.

13. బైబిల్ సమ్మతముగా దేవుడు ఒక్కడేయని ఇతర విగ్రహారాధ నలను మాని సర్వకాలము దైవభక్తిగల క్రైస్తవ మతస్తులు వీరందరు మతములవారు.

## కర్మిష్టులు

కం|| మతముల వారలు తమ స| మ్మతమైనటువంటి శాస్త్ర| మర్యాదలచే|
మితమేరుపరచుకొని బహు| గతులను కలహింతురు||

యనియు శ్రీ భాగవతుల కృష్ణ దేశికులవారు ఆనతిచ్చినారు. వీరందరు మా మతమే గొప్పదనియు. మీ మతము తక్కువనియు, వారి వారికి సమ్మతమైన శాస్త్ర మర్యాదలను కల్పించుకొని, ఒకరినిమించి మరియొకరు యెక్కువగా భాష్యాదులను గ్రంథములను వ్రాసి, లేనిపోని కలహములు కల్పించుకొనుచు, మతాభిమానమనే త్రాళ్ళచేతకట్టు బడినవారలు, కర్మకాండ ననుసరించినవారలు, భ్రాంతిగలవారలే కదా.

## ఉపాసకులు

పుష్పములచే ప్రతిమార్చన చెయువారలు, మనస్సుచే మంత్రోపాసన చేయువారలు, మాలలు చేతబూని జపములు చేయువారలు, దేవతా దర్శనముకోరి తపస్సు చేయువారలు, యంత్ర తంత్ర మంత్రములచే చిత్ర విచిత్రములైన ఇంద్ర మహేంద్రజాల విద్యలు చూపువారలు, భూదాన గోదాన సువర్ణదాన యజ్ఞయాగములుచేసి ఇంద్ర భోగములను గోరువారలు, తీర్థయాత్రలు తిరిగి పుణ్యమును గోరువారలు, సంధ్యావందనాది క్రియలు

సలుపువారలు, వీరందరు ఉపాసనకాండ ననుసరించిన వారలు, భ్రాంతికలవారలే కదా.

## హఠయోగులు

సన్యాసులు, యతీశ్వరులు, దండీ, మహాదండీ, హంస, పరమహంస, అవధూత, వీరందరు వైరాగ్యమను దీక్షనుబూని ప్రపంచ వాసన దగలకూడదని కాషాయములు ధరించి తలలు గొరిగించుకొని కచ్చలు బిగియించి కొండలు, వనములు, దేవాలయములు, నివాసస్థలములుగా, నిర్ణయించుకొని ఆహార నియమములు బూని ప్రపంచమునందు తిరుగుచున్నారు. శ్లొ || అహింసాపరమోధర్మం | పరోపకారం మిదం శరీరం || యనువారలు నపాపం నపుణ్యంయని తమ యిచ్ఛా ప్రకారం ప్రవర్తించేవారలు. వీరందరు హఠయోగ కాండ ననుసరించినవారలు భ్రాంతిగలవారలేకదా.

## విద్యాధికులు

మరికొందరు ఆకాశము, వాయువు, అగ్ని, జలం, పృథ్వి సాంఖ్యముచేత గుణములను శక్తిని కనిపెట్టి వాటిని ఇరువై అయిదులుగా విభజించి వాటి గుణములను శక్తిని కనిపెట్టి తిరిగి ఒకటితో నొకటి వ్యతిరేకముగా మిశ్రపరచి వాటి గుణములను శక్తులను శబ్ద, స్పర్శ, రూప, రసగంధములను కనిపెట్టి ప్రకృతి శాస్త్రము పధార్థ విజ్ఞాన శాస్త్రము, శారీర శాస్త్రము, వైద్యశాస్త్రము, సంగీత శాస్త్రము, యను శాస్త్రములను, వ్రాసిన వారలు వీరందరు విద్యాకాండ ననుసరించిన వారలు భ్రాంతికల వారలేకదా.

## త్రికాలజ్ఞానులు

పంచభూతములను సాంఖ్యముచేత జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, ప్రాణేంద్రియములు, విషయేంద్రియములు, అంతరేంద్రియములు, ఇరువై అయిదు తత్వములుగ యేర్పరచి, శరీరములు అవస్థలు, స్థానములు, వ్యవహారములు, వెరువేరుగా విమర్శించి, వాటిలోని మనస్సు, లక్ష్యము, శ్వాస, యీ మూటిచే ఖేచరీ, భూచరీ, మధ్యమ, షణ్ముఖి శాంభవి, పంచముద్రలను రేచక పూరకముల ద్వారా సాధించి స్వరశాస్త్రము జ్యోతిశ్శాస్త్రములను వ్రాసిన వారలు. వీరందరు భూత భవిష్యధ్వర్తమాన కాలముల నెరుగువారలు. భ్రాంతికలవారలేకదా.

## జ్ఞానాధికులు

మరికొందరు తారకసిద్ధిని పొందగోరి రేచక, పూరక, కుంభకములద్వారా అధికాభ్యాసము జేసినవారలై అణిమ, గరిమ, లఘిమ, మహిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వములను, అష్టసిద్ధులనుజెంది ప్రపంచమును వశపరచుకొని ఘనతవహించిన మహాత్ములు వీరందరు జ్ఞానకాండ ననుసరించిన వారలు. భ్రాంతికలవారలేకదా.

## ప్రజ్ఞానులు

అహంబ్రహ్మాస్మి, అయమాత్మా బ్రహ్మం, తత్వమసీ బ్రహ్మం, ప్రజ్ఞానం బ్రహ్మంబను మహా వాక్యములను ప్రమాణముగా తీసుకొని బ్రహ్మ మందైక్యమును గోరి శిరస్సునందు అష్టదళ పద్మమున.

శ్లో || మధ్యేవైరాగ్యే | కేసరేజాగ్రత | కర్నికాయాం స్వప్నం లింగేసుషుప్తి | పద్మత్యాగే తురీయః ||

యను ప్రమాణము ననుసరించి మనస్సు, లక్ష్యము శ్వాస, సహస్రారమునందు మగ్నత పరచెదరు, దీనినే అమనస్కమనియును, సమాధియనియును నిర్నిద్రయని యందురు. శివజీవైక్యమనియు స్వస్వరూప సంధాన మనియు, ఈస్థితి కుదిరినవారలకు జనన మరణములు లేవనియందురు. వీరందరు శుద్ధజ్ఞానకాండ ననుసరించినవారలు, భ్రాంతికలవారలేకదా.

అయితే కర్మకాండ ననుసరించివారలు, ఉపాసకాండ ననుసరించిన వారలు, వైరాగ్యకాండలనుసరించినవారలు, విద్యాకాండ ననుసరించినవారలు, జ్ఞానకాండ ననుసరించినవారలు, శుద్ధ జ్ఞానకాండ ననుసరించినవారలు, అనగా ద్వైతా ద్వైత విశిష్టాద్వైత, శాక్తేయ గాణాపత్య, శైవ, సౌర, జైన, బౌద్ధ, కుటీచక, కాపాలిక, క్రైస్తవ, మహమ్మదీయ, బ్రతిమార్చన, మంత్రోపాసన జప, తప, దాన, ధర్మ, యజ్ఞయాగసంధ్యావందన, సన్యాస. యతీశ్వర, దండి. మహాదండీ, హంస, పరమహంస, అవధూత, సాంఖ్య, తారక, ముద్ర, యోగ అమనస్కమాదిగాగల సాధనలయంచు ప్రఖ్యాతిని గాంచినవారలు, వీరందరు త్రిగుణాత్మకమైన మాయా బ్రహ్మము ననుసరించిన వారలేకాని మాయాతీతమైన పరబ్రహ్మమును గురించి ప్రయత్నించినవారుకారు.

అయితే ఋషులు, మహాత్ములు, పెద్దలు అనేక గ్రంథములయందు చెప్పబడిన రీతిగా కష్టములు పడిన దంతయు వృథాయైపోయినదాయని శంక చేయ వచ్చును. మంచిది వృథా యెన్నటికినిగాదు. వారు మాయాకల్పితములైన అనేక మార్గముల ననుసరించి, కష్టములచే సిద్ధిని పొందినందులకుగాను తత్ఫలములను పొందగలరు. యెట్లనగా,

1. యజ్ఞయాగాది క్రతువులచే సాలోక్య పదవియు
2. సాంఖ్యముచేత సామీప్య పదవియు
3. తారకముచేత సారూప్య పదవియు
4. అమనస్కముచేత సాయుజ్యపదవియు ఇంకా వారువారు వారి వారి కష్టములకు తగిన ఫలములను పొందగలరు అనగా మంచిజన్మకు రాగలరేగాని జనన మరణములు లేని పదవిని పొందలేరని నావుద్దేశ్యము.

ఈ మంచిజన్మ లభ్యమునకే పరమ పదమనియు, మోక్షమని ముక్తియని వాడుకుందురు. ఇందులో సుకర్మ చేసినవాడు పారమార్థికుడనియు, దుష్కర్మ చేసినవాడు ప్రపంచీకుడనియు, ఎన్నబడుదురు అది యెట్లనగా,

జ్ఞానముచే శుద్ధమనస్సు గలిగి ఊర్ధ్వముఖవ్యాప్తియై వైరాగ్యము ననుసరించి, అభిమానమును త్యజించి నియమములుబూని మోక్షమే కావలెనను యిచ్ఛ గలవాడు పారమార్థికుడనియు.

అజ్ఞానముతో కూడాకొని మలిన మనస్సు గలవాడై, అధోముఖ వ్యాప్తమై కామక్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యాది షడ్గుణములు కలిగి, ధనీషణ, దారీషణ. పుత్రీషణములను, ఈషణత్రయములకు జిక్కి నామ, రూప, కుల, గోత్ర, వర్ణాశ్రమ ధర్మములను అభిమానములకు కట్టుబడి, సంసారమనే బంధమున తగులుకోనినవాడు ప్రపంచీకుడనబడును.

సుకర్మ జేసినవాడు సుఖజీవనముగాను దుష్కర్మ జేసినవాడు కష్టజీవనముగాను పుట్టగలరు, గనుకనే వీరందరు జనన మరణములు గలవారని గట్టిగా చెప్పవలసివచ్చెను, అనగా భ్రాంతిగలవారలేకాని, భ్రాంతి రహితులు కారు.

శ్లో|| కార్యకారణ విరాహిత్యం | అచలోయం సనాతనః | అని

ప్రమాణముగలదు. శివోహం యనిన కారణము, జీవోహం యనిన కార్యము ఈ రెండు మాయనే, ఈ రెండు అహంకారములే, అహంకారము నశించిన వారు భ్రాంతి రహితమైన మార్గమును తెలుసుకొనగలరు. భ్రాంతి యనిన, మాయయనిన సత్తు యనిన చిత్తు యనిన యెరుక యొక్క పర్యాయ పదములే.

కం|| ఎరుకే దేహేంద్రియములు | యెరుకే వర్ణాశ్రమములు యెరుకే
శృతులున్ | యెరుకే నీవును నేనును | యెరుకే సతిసోదరాదు ||
లెరుగుమీవత్సా | నేదీర్చెదా నిదుగోనీయిచ్చా | హరిహర
బ్రహ్మాది సురనర గిరిసరి త్తరుమృగమఖ చరాచరమూలు
యెరుకాని | యెరుగుము వత్సా ||

కం|| యెరుకే విద్యావిద్యలు | యెరుకే ప్రణవంబు నాద | మెరుకే కళయున్
యెరుకే బిందువుసచ్చి | తైరుకే ఆనందమివినీ వెరుగుసద్బుద్ధి || నీ నా
మాటలెరుకేనిబద్ది యెరుకే నిర్గుణ సగుణా లెరుకె యెరుకకు యంత|
యెరుకో నేనిదియంత యెరుకా జేసితినీవి | ల్లెరుగూ సద్బుద్ధి ||

కం|| యెరుకే యిహపరసౌఖ్యము | లేరుకే జ్ఞానంబుజ్ఞేయ మెరుకే మోక్షం
బెరుకే భక్తివిరక్తులు | యెరుకే సంకల్పమివి నీవెరుగూ సత్కీర్తి |
యెక్కడికౌర యెరుక సంపూర్తి యెరుకే జీవుండీశుండెరుకే తదేకత
ఎరుకే సర్వము నేగుర్వైరిగి దెల్పితి యీకీ | లెరుగు సత్కీర్తి ||
యని భాగవత కృష్ణదేశికులవారు సెలవిచ్చినారు. మరియు.

కం || నానా విద్యలచాతను నానా విధశాస్త్రతతుల | ననునమ్మటకై
నేనే రచించి పెట్టితి | నానా దేశములయందు నర రూపమునన్ ||

కం || కావేటి కాలువలవలె | నా వల్లనే కల్పనౌను నానా విద్యల్
ఈ విశ్వమందు, విశ్వము | నా వెంటనె వచ్చుపోపు నావలెను
సుమీ ||

కం || వినుభాష్యము లనుత్రాళ్ళను | జనములు ననుగట్టియుంచ
జనకనిలుతునా |
చనుదత్తు నాకునేనై | గనుకనె ననునమ్మరెపుడు ఘనులగువారల్
చూచితిరా? ఈ పద్యములో మాయ తన రహస్యమును తనంతతానే వెలిబుచ్చుకొనుచున్నట్లు పెద్దలు వక్కాణించుచున్నారు.

శ్లో || భ్రమేణాహం భ్రమేణత్వం | భ్రమేణో పాసకాజనః ||
భ్రమేణీశ్వర భావత్వం | భ్రమమూల మిదం జగత్||

కం || కర్మమునబుట్టు జంతువు | కర్మమునను వృద్ధిబొందు | కర్మమున
జెడున్ | కర్మము జనులకు దైవము | కర్మము సుఖ దుఃఖములకు|
కారణమధిపా ||

ఈ శ్లోకములో సర్వం, భ్రమ, భ్రమవల్లనే జన్మము కలుగుచున్న దనియు భావము. భ్రమయనిన, కర్మయనిన, వాసనయనిన, భ్రాంతియనిన ఒకటే. మాటల బేధము, అయితే.

శ్లోకభావమును పద్యభావమునుబట్టి మోక్షమునకు యేమి కావలయునో యని విచారించగా భ్రమమూల మిదంజగత్ యను వాక్యమునకు భ్రమరహిత మిదం మోక్షం యను వాక్యము కర్మమున బట్టు జంతువు అనువాక్యమునకు "కర్మ రహితంబైన ముక్తి" యను వాక్యము కావలసినట్టుగా అర్థము స్ఫురించుచున్నది గదా? జనన మరణ రహితమైన మోక్షమునకు, భ్రాంతిరహితమే కావలసినదిగా దృఢపడుచున్నది.

ఈ విచారణకు ఏ ఉపనిషత్తులు, శృతులు, శ్లోకములు, పద్యములు ఆధారముగా తీసుకుంటమో ? వాటి అర్థముపైవారలు గ్రహించకపోయినారాయను సందేహము గలుగవచ్చును, మంచిది,

శాస్త్రమునకు ఉపమానప్రమాణము, శబ్ధప్రమాణము, సందేహ ప్రమాణము, ప్రత్యక్ష ప్రమాణము అని నాలుగు ప్రమాణములు గలవు.

1. ఉపమాన ప్రమాణమనగా, విగ్రహారాధన సల్పడము.

2. శబ్ద ప్రమాణమనగా, మంత్రోపాసన జేయడము.

3. సందేహ ప్రమాణమనగా, యోగాభ్యాసము జేయడము.

4. ప్రత్యక్ష ప్రమాణమనగా, ఉన్నదున్నట్లుగా ప్రత్యక్షముగా తెలుసుకోవడము.

ఈ నాలుగు ప్రమాణములలో పై వారలు మొదటి మూడు ప్రమాణములలోని వారలేకాని ప్రత్యక్ష ప్రమాణము తెలిసినవారలు కారు. గనుకనే భ్రాంతిగల వారలని దృఢముగా చెప్పవలసి వచ్చినది.

ప్రత్యక్ష ప్రమాణము దెలియనంతవరకు యెంతటివారికైనను భ్రాంతిరహితముకాదని నా నమ్మకము. గనుక ఉన్నదున్నట్లు నిజము తెలిసిన వారలు శృతులు, శ్లోకములు, ఉపనిషత్తులు, పద్యములకు చెప్పిన అర్థమునకును పైమూడు ప్రమాణములలో వున్న వారలు చెప్పిన యర్థమునకు, చాలా వ్యత్యాసముగా నుండును. శ్లోకములు, శృతులు, ఉపనిషత్తులు, పద్యములు, గ్రంథములు, ప్రపంచమునందు వేలకువేలుగా నున్నవి. ఇందులో నిజము గ్రహించినవారు చెప్పినవి వున్నవి. నిజము తెలియని వారు చెప్పినవి కూడా ఉన్నవి. అదియెట్లనగా.

సత్యమై, నిత్యమై, కేవలంబై, నిరాకారమై నచ్చిదానంద రూపాత్మక చైతన్యమై యని చెప్పినారు చూచితిరా? పై నాలుగు పదములు పరమార్థమునకు పోలినవి. ఐదవ పదము మాయకు పోలినది. ఇదేకాక యెవరినైనను దేవుడు యెటువంటి వాడని ప్రశ్నించగా

కం || జనులనిరి దేవుడెవరికి | కనరాడని నామ రూప కర్మ జననముల్
గననతనికి లేవని యందురు.

నిరాకారం, నిర్వికారం, నిరంజనం, నిర్గుణంబని యందురు. అనగా, ఆకారములేదు వికారములేదు, గుణములేదు, యని అర్థంబగుచున్నది. అయితే, ఈ జగత్తును యెవరు పుట్టించిరి, యని ప్రశ్నించగా.

దేవుడు తన సంకల్పము వలన మాయను పుట్టించి ఆ మాయకు తన యొక్క సత్తాకొంతనిచ్చి మాయను తనకు సహాయముగా వుంచుకొని జగత్తును పుట్టించెనని చెప్పుదురు.

చూచితిరా ? యీ మాటలు యెంత విపరీతములుగా నున్నవో ! నిరాకార మనగా దేహములేనివాడు. దేహమేలేనప్పుడు కర్మేంద్రియములులేవు అంతరేంద్రియములు అంతకన్నలేవు గదా? దేవుడు మాయను ఏ యింద్రియ సంకల్పమువలన పుట్టించెను? అట్లనుటకు యిచ్చటయేమైన అవకాశము గలదా? వారల జ్ఞానము వారల తెలివితేటలు ఈ లాగుననున్నవి. గనుక నిజము తెలియని వారలు చెప్పిన గ్రంథములు శ్లోకములు, ఉపనిషత్తులు, పద్యములు సర్వము ఇవ్విధముగానే వుండగలవు.

నిజము తెలిసినవారల శ్లోకములు, శృతులు, ఉపనిషత్తులు, పద్యములు, సర్వము నిష్కళంకముగా వుండగలవు.

శ్లో || నిరాలంబాయ నిత్యాయ | నిర్మలాయ నిరంజన
నిత్య శుద్ధాయ బుద్ధాయ | వస్తుమద్రహింతం నమః |

అనునట్లు నిజము తెలిసినవారు చెప్పిన శ్లోకములు గాని, శృతులు గాని, ఉపనిషత్తులు గాని, పద్యములు గాని, యీ ప్రకారంవుండగలవు. ఇందులోయే మాత్రం సంశయములేదని నా యొక్క నమ్మకము. నిజము తెలిసిన వారెవ్వరోయని శంక వుండవచ్చును. ఇదుగో శ్రీ మహావిష్ణువు, సూర్యుడు, యాజ్ఞవల్క్యమహాఋషి, జనక చక్రవర్తి, శ్రీ శుకులు, సాందీపిని, శ్రీకృష్ణ పరమాత్ముడు, అర్జునుడు, శ్రీధరస్వామి, శ్రీ శివరామ దీక్షితులు, శ్రీ భాగవతుల కృష్ణప్రభువులు వీరలు చెప్పిన శ్లోకములు శృతులు ఉపనిషత్తులు, పద్యములు, గ్రంథములు కేవలం నిర్మలంగా, వుండును. అవి యెక్కువగా తీసుకొని చెప్ప వలెనని గాని యిక్కడ ఉదహరించవలెనని గాని వుద్దేశములేదు. ఏవియైనను సూక్ష్మముగా చెప్పవలెనని తలచుకున్నాను.

గీ || భక్తిగలుగు కూడు పట్టెడైన చాలు (యనియు)

గీ || నిక్కమైనటువంటి నీల మొక్కటే చాలు | తళుకుబెళుకురాళ్ళు
తట్టెడేల || చదువ పద్యమరయ చాలదావకటైన (యని)
లోకోక్తిగలదు.

విజ్ఞానము సూక్ష్మబుద్ధి సూక్ష్మగ్రాహ్యము గలవానికి వకమాట చాలదా? వేయిమాటలేల నిజము తెలిసిన వారిని యే ప్రశ్న యడిగనను చక్కగా సమాధానము చెప్పగలరు. వారికి కోపము గాని అహంకారము గాని వుండదు.

నిజము తెలియని వారిని ఒక ప్రశ్న యడిగితే సమాధానము చక్కగా చెప్పరు సరిపోలేదండి యని అంటే, వారికి మహాతీవ్రమైన కోపము అహంకారమునకు లెక్కనేలేదు. కావలసివుంటే మీరు పరీక్షజేసి చూచుకొనవచ్చును. ఇదిగాకను.

కొందరు వేదాంతులు దేహిసత్యం దేహమసత్యంబని వాదములు సల్పుచున్నారు. అయితే కరచరణాది అంగములు గలిగి మొద్దువలె కనబడుచున్నదే దేహము సర్వమును గుర్తెరుగుచు మంచి చెడ్డలను గ్రహించుచున్నదే దేహి అనగా తెలివి

దేహిని విడచి దేహము గాని దేహమును విడచి దేహి గాని పనులు జేయగలవా?

రెండొక్కటైన యెడల ఏ పనులైనగాని చేయగలవు.

ఇందులో ఒకటి సత్యం ఒకటి అసత్యమెట్లు, రెండు సత్యమైన కావలసినది? లేకరెండు అసత్యమైనకావలసినది? కాని, సత్యా సత్యములుగా వుండనేరవు.

గుడమే మధురము, మధురమే గుడము బెల్లములేక, తీపిగాని తీపి లేక బెల్లముగాని వుండబడదు. ఈ విధముగానే దేహి దేహములు రెండు ఒక్కటే.

ఉ || ఒక శర్కరబొమ్మ దాని అంగుష్ఠము మొదలు శిరఃపర్యంతం తీపిగా వుండగలదుగాని సగము తీపి సగము చేదుగా ఏ కాలమందైనను వుండనేరదు? నిజము తెలియనివారి విచారణగూడ యిలాగుననే వుండగలదు, దేహి దేహములు మాయా కల్పితములైన అసత్యములేకాని, సత్యముకాదు.

మాయ అసత్యమైనది. అశాశ్వితమైనదైనను, దానియందు వ్యవహారిక సత్యత్వమున్నదని చెప్పినారు. వ్యవహారిక సత్యమనగా యెటువంటిదోయని శంకచేయవచ్చును. అది యేలాగనగా !

నూరుగురు దొంగలు ఏకమై ఒక పట్టణములో సాహుకారి యింటికి బందిపోటు వేయుటకుగాను ఒకనాటి రాత్రి వెళ్ళి సాహుకారి యింటి తలుపులు తాళాలు బ్రద్దలుకొట్టి లోపలికిపోయి యింటిలోనున్న వారలను అనేకవిధముల బాధించి హింసించి వెండి బంగారం మొదలైన వస్తువులను మూటలు కట్టుకొని బైలుదేరి ఒక కొండలో చేరినారు. తర్వాత వారిచే అపహరింపబడిన ధనమును విభాగించు కొన దలచి వారిలో నొకనిముందు ఆ ధనమంత యుంచినవారు. అందలో ఒక దొంగ ఓ రామన్నా ! మనము తెచ్చినసొత్తు అందరికి సమభాగముగా పంచగల వాడవనియు బుద్ధిమంతుడవనియు, పెద్దవాడవనియు నీముందుంచినాము. అనగానే ఓ యంకన్నా ! ఎంత మాటాడితివి నేను పిల్లలుకలవాడను ఒకరిని అన్యాయము గాని, మోసముగాని చేయువాడనుగాను అందరికి న్యాయముగా పంచగలనని జవాబు చెప్పెను.

చూచితిరా? ఆ రామన్న మాటలో యెంత సత్యమున్నదో, వారు దంగలైనను వారి వ్యవహారము కేవల దుర్మార్గమైనను ఆ సొత్తు అన్యాయముగా తెచ్చినదైనను వారు విభాగించుకొను సమయమందు న్యాయము సత్యము కావలసివచ్చింది.

ఆ సమయమందు న్యాయము సత్యము లేనియెడల వారల

వ్యవహారమునకు భంగము తప్పక వాటిల్లును. దీనినే వ్యవహారిక సత్యతత్వమని చెప్పవలసి వచ్చినది. ఇదే అసత్యములో సత్యము.

ప్రపంచము అశాశ్వితము అసత్యమైనదని మన యిష్ట ప్రకారము ప్రవర్తించుటకు అవకాశములేదు. జాగ్రత్త ఇదుగో మనమేకాదు చక్రవర్తులు మహారాజులు. జమీందారులు, ధనవంతులు, వర్తకులు మొదలైన వారందరు వ్యవహారిక సత్యత్వంబు గలవారలే. గనుక మనకందరికి మూలం, మాయ దానికి యెటువంటి ప్రజ్ఞగలదో అధికారముగలదో అటువంటిదే మన అందరియందు వుండగలదుగాని ఇతర ముండగలదా.

శ్లో || యధారాజ తథాప్రజాః | యను వాక్యము ఇచ్చట సరిపోవుచున్నది. పారమార్థమునకు ప్రపంచమునకు సంబంధము కలదా

మాయాతీతమైనది పరమార్థము మాయా సంబంధమైనది ప్రపంచము గనుక పరమార్థమునకు ప్రపంచమునకు ఏ మాత్రము సంబంధమున్నట్లు యెక్కడను కనబడలేదు.

ప్రపంచమునకు సంబంధములేని పరమార్థము వుండిన నేమిఫలము లేకున్న నేమిఫలము అని శంక చేయవచ్చును. కాని ప్రపంచమునకు అనగా మనకు జనన మరణ రహితమై మోక్షము కావలసిన సమయనందు మనమే పరమార్థమును ఆశ్రయించవలసి వచ్చుచున్నది. కాని నన్నాశ్రయించమని పరమార్థము యే కాలమందునను కోరదు.

ఆశ్రయించితే మాత్రము శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు లేనటువంటి పరమార్థము శబ్ద స్పర్శ రూప రస గంధములు గల మనకు యే విధముగా సహాయము జేయును యని సందేహించవచ్చును,

విషముద్రావి చావవలెనని సంకల్పము మనకు యే కాలమందునను రాదు. కాని మన మోకప్పుడు ప్రాణత్యాగము జేసుకోవలెనని సంకల్పము గలిగినవాడు మాత్రము విషమును తప్పక ఆశ్రయింపవలసి వచ్చుచున్నది.

ఈ తీరుననే మనకు జన్మ రహితమైన మోక్షము కావలెనను ఇచ్ఛ గలిగిననాడు పరమార్థమును ఆశ్రయించవలసి వచ్చుచున్నదని నా ఉద్దేశ్యము.

లేని యెడల దాని అవసరము దీనికిలేదు. దీని అవసరము దానికి లేదు ఇందులో యేమైన సంశయమా ? లేదుగదా.

ఈ విచారణ చాల బాగుగనే వున్నదికాని, నిరీశ్వరవాదమో లేక శూన్యవాదమోయని కొందరు సందేహించు చుండవచ్చును.

నిరీశ్వర వాదమనగా. దేవుడు లేడనే వాదము.
శూన్యవాదమనగా ? యేమి లేదనే వాదము.
దేవుడు లేడనే విచారణ మనమింతవరకు చేయనేలేదు.

దేవుడు వున్నాడు. మాయకు అతీతమైనవాడు. భ్రాంతి రహితమైన మోక్షము వున్నదని నిశ్చయించినాము నిరీశ్వర వాదమెట్లయినది. కాదుకదా.

మరియు ఉన్నట్లుగా కనబడుచుండి మరి ఒక కాలమందు కనపడక పోవు దానిని శూన్యమనియు మిథ్యయనియు, మాయయనియు, చెప్పవలె కాని యేమిలేని దేవునికి శూన్యమనే పేరురాదు.

అది యెట్లనగా మన తాతలు, ముత్తాతలు ఒక కాలమందు మనవలెనే వుండిరికదా? యిప్పుడు వారిని చూడవలెనని తలంచితే వున్నారా? లేరు: వారిని శూన్యమనియు, మిథ్యయనియు, మాయయనియు, చెప్పనగును.

మన తాత ముత్తాతలవలె మనముకూడ ఒక కాలమునకు లేకపోవువారము గనుక మనమే శూన్యముకాని పరమార్థము అటువంటిది కాదు.

శ్రీ సద్గురు కరుణ గలిగిన జ్ఞానులకు సర్వకాల సర్వావస్థల యందును శాశ్వితమై సత్యమై యున్నది.

కం || "కనుమూసిన కనుదెరచిన | కనుమరుగింతై నలేక | కానంబడు"
యని ఉపనిషద్వాక్యము గలదు. చూడంది శూన్యమనుటకు
యిచ్చట యేమైన అవకాశము గలదా !

మంచిది లోకములో శివుడు, విష్ణు, రాముడు, శక్తి మొదలైన నామముల యందు భక్తి గలిగి సేవించుచున్నారు గదా? వారిని యేకాలమందైనను ప్రత్యక్షముగా చూచిరా? ఒక కాలమందు కనబడి వుండవచ్చును. అప్పుడే కనబడి చప్పున అదృశ్యమై పోయినారేమోకాని సర్వకాలము సర్వావస్థలయందు కనబడుచుండిరా?

జ్ఞప్తికి వచ్చినప్పుడు బుద్ధికి స్పురించుచుండిరేమోకాని కనుల కగుపడుచుండిరా? లేదుగదా? శూన్యమేదో మీరే ఆలోచించవలసినది.

లోకులవాదమే శూన్యవాదమాయె, అట్లంటిమా, తిట్టవస్తారు లేక కొట్టవస్తారు.

"సత్యం జన విరోధాయ | అసత్యం జన రంజనం" యని పెద్దలు వచించినారు. లోకులకు సత్యము చెప్పిన యెడల కోపము వచ్చుచున్నది. గనుక అసత్యమే చెప్పవలెను.

శ్లో|| కర్మ పూరిత దేహానాం | ధర్మశాస్త్ర మరోచకం
చర్మఖండన భక్షాణాం | శ్వానం ఘృత మరోచకం ||

అయితే ఈ ప్రకారం విచారణ చేసేవారలు ఈ కాలమందుగాని ఇంతకు లోగాగాని వున్నారో లేదో, మాకు ఒకరైనను కనబడరు. అని మీకు సందెహము గలుగవచ్చును. వినవలసినది అప్పటికిన్ని ఇప్పటికిన్ని ఎప్పటికిన్ని ఉన్నారు. వారు గుర్తులకు చిక్కేవారుకారు సన్యాసులు, యతీశ్వరులు, స్వాములు, దండి, మహాదండి, మొదలైన వారల వలె వుండేవారుకారు. గురువులమనే పేరు పెట్టుకొని వేషములు ధరించి పేరు ప్రతిష్ఠలకై ఊరూరు తిరిగే వారుకారు. వేదాంతులమని లేనిపోని వాదములు కల్పించుకొని తర్క, వితర్కములు సల్పేవారుకారు అహంకార రహితమైన నడతగలవారు సాధుహృదయులు రాజయోగమవలంబించి సంసారమునందే యున్నారు.

కం || తనుమనధనములు గురునకు | వినయంబున ధారబోసి | వేడ్కగురు

నిచే | అనువైన బోధవడసిన | ఘనమతిమంతులు || సమరస ప్రజ్ఞ గలవారలు జనులవలె జరుపు పనులను అను నార్యోక్తిననుసరించి అందరి వలెనే నడుచుకొన గలిగిన నేర్పుగలవారలు.

కం || జలము నెడబాయనట్లని | జలచరముల తీవిబూని సచ్చిష్యుడు
హృజ్జలజంబను పీఠముపై | నిలిపితరముమాని | గురువునే గొల్చు
సుమ్మీ ||

యను ప్రమాణము ననుసరించి సర్వకాలము గురునామ స్మరణయే దీక్ష గలవారలై నిందాస్తుతులకు చెవియొగ్గని వారలు కృత, త్రేత, ద్వాపర యుగము లందేగాక కలియుగమునందును అప్పటికి ఇప్పటికి యున్నారు. వారి నామధేయములను వివరించెదను.

శ్రీ దయానంద పొన్నాల సాందీపిని గారుసికింద్రాబాద్

శ్రీ నిజానంద పోలోజు వీరయ్యాచారి గారురామసాగరం

శ్రీ వివేకానంద ఆగోలు సంగయ్యగారుఖమ్మంమెట్టు

శ్రీ సహజానంద టి. నాగప్ప వకీలుగారుగద్వాల

శ్రీ అమలానంద పాటల పంధరీనాథ్ గారుగద్వాల

శ్రీ విద్యానంద యం. వేంకనగౌడుగారురాయచూరు

వీరలు సద్గురు మూర్తి నాశ్రయించి క్రమముగా నిజమైన మార్గమును తెలుసుకొని గురుకటాక్షమునకు పాత్రులై గురువాజ్ఞ ప్రకారము ప్రతి పౌర్ణిమ దినమందు గురుపూజ సలుపుచు భజన విచారణేత్యాది వేదాంత గ్రంథ పఠన సలుపుచు తమ్మాశ్రయించిన భక్తులకు అచలబోధోపదేశంబున కృతార్థులజేసి పరిపూర్ణ భావజ్ఞులై యుండువారలు వీరలే నిజము తెలిసినవారలు భ్రాంతి రహిత నిజ సాంప్రదాయకులు.

## మోక్షమెవ్వరికి :-

భ్రాంతిరహితము కావలెనని చెప్పుచున్నారు కదా? బొందిలో ప్రాణము వుండినంతవరకు భ్రాంతిరహితము కాదుగాని, ప్రాణముపోయిన తరువాత ఔనే మోయని కొందరికి సందేహాము గలుగవచ్చును. చనిపోయిన వారికి మాత్రము భ్రాంతి రహితమైనదా? కాలేదు. ప్రతి మనుజుడు చనిపోవుకాలమందు యేదో ఒక భ్రాంతియందు మగ్నుడై చావగలడుగాని వూరికే చావడని నాయొక్క నమ్మకము.

## భ్రాంతిరహితమనగా:-

చావురాకముందే చావడమునకు భ్రాంతి రహితమని యందురు అది యెట్లనగా?

ఉదా:- ఏ విధమైన విత్తనములుకాని, కొన్ని విత్తనములుతెచ్చి అందులో నుంచి కొద్దిగా విత్తనములను తీసుకొని తప్పలోహాకళాయిలో వేసిన నవి వేడియగును. అప్పుడు వాటిని బయటతీసి పచ్చి విత్తనములలో కలిపిన యెడల అన్నియు పచ్చి విత్తనముల వలెనే యుండును (అటువలెనే భ్రాంతి రహితులు కూడా జనులవలెనే యుందురు) కాని అన్నియు భూమిలో నాటిన

పచ్చి విత్తనములు మొలకెత్తగలవు యేగిన విత్తనములు మొలకలెత్తునా? యెత్తవు యెందుకనగా మొలకలెత్తు యంకురము వేడిచే నశించిపోయినది అందువల్ల మొలకలెత్తవు అదే విధముగా,

భ్రాంతియనే అంకురము నశించి పోవడమే భ్రాంతిరహితముకాని భ్రాంతిచే మనుష్యులు చనిపోయిన భ్రాంతిరహిత మగునా? కాదు. పచ్చి విత్తనములు మొలకలెత్తునట్లు జనన మరణ ప్రవాహామునం బడుచుందురు.

1. ఇదియునుగాక, పరస్త్రీని పట్టవలెననే యిచ్ఛగలవాడు జారుడు.
2. పరధనమును పట్టవలెననే యిచ్ఛగలవాడు చోరుడు.
3. పరరాజ్యమును పట్టవలెననే యిచ్ఛగలవాడు శూరుడు.
4. పరబ్రహ్మమును పట్టవలెననే యిచ్ఛగలవాడు ధీరుడు.

స్త్రీకి సంబంధించిన వారెవరైన, నన్ను చూడగలరేమొ పట్టి కట్టి కొట్టగలరేమో, చంపగలరేమో యను భయము జారునికి.

ధనవంతులు పట్టుకొనగలరేమో, చెరసాలలో వేయించగలరేమో, చంప గలరేమో యనుభీతి, చోరునికి.

శత్రువులచే చిక్కుకొనగలనేమో, అస్త్రశస్త్రంబులఘాత పడగలనేమో వారిచే చంపబడుదునేమో యను దిగులు శూరునికి గలిగిని యెడల.

జారునికి పరస్త్రీ, చోరునికి పరధనము, శూరునికి పరరాజ్యము. స్వాధీన ములుకావు. ఆ భయములు లేనియెడల స్వాధీనములు కాగలవని నా యొక్క నమ్మకము.

యీ ముగ్గురు చచ్చియున్నవారలా? బ్రతికియున్న వారలా? ఆలోచించవలసినది.

ఈ విదముగానే ధీరుడు సర్వత్యాగము గలవాడు గనుకనే భ్రాంతి రహితుండని చెప్పవలసివచ్చెను. చచ్చిన తరువాత భ్రాంతి రహితముగాదు బ్రతికి వుండగనే బ్రాంతిరహితము కావలెనని నా ఉద్దేశ్యము.

కొందరు ఉద్యోగాది వ్యవహార కష్టముల కోర్వలేక వేషములు వేసుకొని గురువులమని కొందరి శిష్యులను తమకు లోబడిన వారినిగా

జేసుకొని రహస్య స్థానములు యేర్పాటు చేసుకొని (సర్వం ఖల్విదం బ్రహ్మం బనుచు) వారలకు లేనిపోని మంత్రములను కొన్ని ఉపదేశించి మనము భ్రాంతిరహితులము మనకు బేధమే లేదనుచు మత్తు పదార్థములను గ్రహించి తినరాని పదార్థములను తీర్థ ప్రసాదములుగా పుచ్చుకొనుచు గురు పూజయని పేరుపెట్టి బుఱ్ఱకాయ చేతబూని వారి వారికి యిష్టమైనవి కొన్ని, వచ్చిరానివి కొన్ని పాటలు పాడుచు యెంతో భక్తిగల వారివలె నటించుచు మన మందరము గురు పుత్రులము మనకు పాప పుణ్యములు లేవుయని స్త్రీలు, పురుషులు యేకమై చేయరాని చేష్టలు జేయుచు కాలము గడుపుచుందురు ఈ విధముగా ఇంకా అనేకులు అనేక మార్గములుగా లేనిపోనివెన్నో కల్పించుకొని ప్రవర్తించే వారలు గలరు. వారి రహస్యముల నెల్లవిస్తరించనలవి కాదు.

ఇటువంటి వారల దగ్గరను మతాచార ధర్మములుగా పూజ సల్పువాడో, లేక మాలచేతబూని జపము జేయువాడో, లేక యేదో ఒక వ్రతముగలవాడో, వచ్చినట్లయితే వానిని జూచి.

కం || ఏ సాధన నీ కెందుకు వీసానికి పనికిరాదు | యని యెవరో చెప్పిన పద్యము జెప్పి వానిని అపహాస్యము చేయుదురు. తాను చెడిన కోతి వనమంతా జెరిచెనను సామెతగా, వారు చెడినదేకాక ఆ వచ్చిన వానియందున్న దేదో భక్తి, దానియందు కూడ వానిని నిలువకుండా, చెరిచి వేయుచున్నారు. ఇదుగో వీరిలే ఉట్టికిలేక, స్వర్గానికిలేక చెడిపోపు వారలు.

కం|| అనుభవ వేదాంతులమని తినరాని పదార్థమెల్ల | తిను దుర్జనులన్ |
కనబోకుము తద్బోధను | వినబోకుము యెన్నటికి | వివేక విచారా ||

కం|| జిహ్వోపస్తల విషయము | లెవ్విగలవొ వాట్నివిడువలేని
గురువులన్ || ఎవ్వరుచేరి కొలతురో | యివ్వసుధను వారు
జెడుదురిది నిజము సుమీ || అనియు పెద్దలు చెప్పియున్నారు.
గనుక, ఇటువంటి వారలను చేరిన యెడల, ఉభయ భ్రష్టత్వము
తప్పక గలుగ గలదని నా ఉద్దేశ్యము.

మనము మొదటినుండి యింతవరకు విచారణచేసి చూడగా ప్రపంచములో మోక్షమును గురించి విచారణ జేయుచున్న లోకుల విచారణ అంతయు శ్రోత, త్వక్కు, చక్షు, జిహ్వా, ఘ్రాణ, వాక్పాణిపాదపాయూపస్థ మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము మొదలైన జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ,

అంతరేంద్రియములను అనుసరించిన కర్మలు చేసిన వారేగాని జ్ఞానముచే విచారణ చేసిన వారెవరును కనుపడలేదు.

జ్ఞానములో అజ్ఞానము కూడ వున్నది. అట్లుగాక శుద్ధ జ్ఞానము గలుగిదానిచే విమర్శ జ్ఞానము గలిగి ఆ పైన ప్రజ్ఞానము గలుగవలెను.

ప్రజ్ఞానము గలవాడే జనన మరణ రహితంబైన విచారణకు అర్హుండనినా ఉద్దేశ్యము.

అయితే పైన జెప్పబడిన కర్మ కాండాదిగాగలవారలు జ్ఞానములేని వారలేనాయని సందేహించవచ్చును. వారలకు గలిగిన జ్ఞానము మిశ్రమ జ్ఞానముగాని శుద్ధ జ్ఞానముకాదు.

యెట్లనగా పై వారు స్థూల సూక్ష్మకారణ శరీరములకు సంబంధములగు కర్మల చేసినవారేగాని, మహాకారణ శరీర సంబంధమైనవిగావు. ఈ మహాకారణ శరీరమునకే ఎరుకయనియు జ్ఞాన మనియు, సాక్షి యనియు ద్రష్ట యనియు, యందురు. మోక్షము మహాకారణ శరీరమునకేగాని, స్థూల, సూక్ష్మ, కారణ శరీరములకు గాదు.

స్థూల సూక్ష్మ కారణ శరీరముల కర్మలవన ఉత్తమ జన్మ ప్రాప్తి గలుగును. మహాకారణ శరీర కర్మ (అనగా) జ్ఞానముచే చేయబడిన విచారణ ఇందులో రజోగుణ తమో గుణముల ననుసరించినది కాకుండా, కేవలము సత్వగుణము ననుసరించి విచారణ చేసిన యెడల జనన మరణ రహితంబగు మోక్షము గలుగ గలదని నా యొక్క నమ్మకము.

కం|| ఆగామీ కథయెట్లన | బాగుగ వివరింతు చెవుల | పండువు గాగన్ |
ఆగమ నిగమోపనిషత్సాగర మథితార్థమవల |
సాంగోపాంగముగాన్ |

యను ప్రమాణము ననుసరించి ఆగమములు, నిగమములు, ఉపనిషత్తులను సముద్రముగాజేసి మర్థించగా తేలిన సారాతీతమును సద్గురువుల నాశ్రయించియే మాత్రము కొరతలేకుండా చక్కగా ఉన్నదున్నట్లు నిజము తెలుసుకోగలరని నమ్ముచున్నాను, అట్లుగాక.

కం|| జపములు తపములు జేయును | విపరీత స్మరణజేయు
వేదాంతార్థం | బపరిమితంబుగ జెపు ్పను | కపటాత్ముడు శిష్యకోటి
గనిమెచ్చుకొరకు | మెచ్చిద్రవ్యమును యిచ్చుకొరకు||

ఇటువంటి పురుషులను చేరిన యెడల వారికి వచ్చిన విద్యనే చెప్పగలరు. గాని వారికి తెలియని విద్య యేలాగు చెప్పగలరు. (యధా గురు, తధా శిష్యా) గురువునకు రాని విధ్య శిష్యునకు ఏలాగు చెప్పగలడు.

కం|| ఇంగితము నెరిగి సద్గురు | పుంగవుచే నరుడు భుక్తి
ముక్తి క్రియలన్ | సంగా సంగము లెడలిన | శృంగారము
వానిచేష్ట | చూచేవారలకూ | వాడున్నట్లు తోచేవారలకూ ||

యని పెద్దలు చెప్పినారు గనుక గురువును వెదకి పట్టవలెను. కనపడిన వారంతా గురువులు కారు. నిజ సాంప్రదాయ గురువును వెదకి పట్టిన ధీరునికే జనన మరణ భ్రాంతి రహిత స్థితి కరతలామలకము యిందుకు యేలాటి సందియములేదు.

కం|| మానవుడు చేయబూనిన | దానిని లోతెరిగిచేయ దగునని మదిలో |
నేనెరిగి నీకు చెప్పితి | పూనుము రుచిబుట్టదేని | పోనీ నీ మనసూ |
రుచిబట్టితె పూనూ నీ మనసూ | నేనేమి యనబోతె నీ కేమి
దోచూనో | లేని నిష్ఠూరము లేకుండుటే లెస్స | పోనీ నీ మనసూ ||

అని వున్నది గనుక మనమొక కార్యమునకు దిగవలసిన సమయము నందు దానికి సంబంధించిన సందర్భా సందర్భములను చక్కగా విచారించి పూనుకోవలసినదేగాని విచారణ చేయక, పూనుకొనిన యెడల ఫలము గలుగదని నమ్మగలరు. గనుక బుద్ధిమంతులైనవారలు ఈ ఉపన్యాసము నందుగల అంశములను చక్కగా గ్రహించి యేమైన అపశబ్దములు వుండిన యెడల సుశబ్దములుగా భావించగలరని నమ్మి సద్గురు మూర్తులైన శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర దేశిక ప్రభువరుల పాదపద్మములకు సర్వకాల సర్వావస్థల యందు సాష్టాంగము లర్పించుచున్నాడను.

ఓం శాంతిః శ్శాంతిం శ్శాంతిః

సందేహ నివర్త్యోపన్యాసము సంపూర్ణము.

○

# శ్రీసద్గురవేనమః

## పరతత్త్వ ప్రకాశిక కందార్థదరువులు

1 ధర లోపల మందిప్పల | వరనాగనయార్య సత్య | వాక్యపరునకున్
| మరియాశమాంబకునునే | హరువరమున బుట్టినట్టి |
హనుమయాఖ్యుడనూ | సాధుసజ్జన ఆశ్రితుడనూ | అరయాగ
వేంకటేశవధూత కృపచేత పరిపూర్ణ బోధనే బడసి ధన్యుడనైతి |
హనుమయాఖ్యుడనూ | సాధు సజ్జన ఆశ్రితుడనూ ||

2 బయలన వస్తువు యెట్టిది? బయలన యెచ్చోటనుంది?
బయటనలోనా ? బయలన అగుపడుచున్నద ? బయలని
చెపు ్పటకు నదియూ | బయలావుచుందా ? చెప్పకపోతె
బయలుగాకుందా? బయలు బయలు బయలు బయలు యనుచుబలికే
? బయలూకు పై వేరే బయలున్నదా దెల్పు ? బయలావుచుందా ?
చెప్పకపోతె బయలుగాకుందా?

3 బంధము మోక్షములనియెడి | బిందుత్రయమేమిలేక | బీజములేకన్
సందేహమేమిలేకను | అందముగను క్రిందమీదా అంతాటయుండూ
|| అచలముయెపుడా తీతమైయుండూ | వింతావింతగదోచే
విశ్వములేకాను | సంతాత మొకరీతి సాక్షిలేకనుయుండూ |
అంతాటయుండూ | అచలము యెపుడాతీతమైయుండూ ||

4 అచలము యచలము యంటివి | అచలంబన యర్థమేమి ?
యనుభవ మేమీ ? అచలము చలనముయగునా ? అచలము
బ్రహ్మాండములకు || ఆధారమగునా ? తెలియక నీవు |
వాదించనగునా ? వచన రచనలచెత | వాగితే ఫలమేమి |
అచలము సాక్షాత్తు ? అనుమానమా దెల్పు | ఆధార మగునా |
తెలియక నీవు వాదించనగునా ||

5 జీవేశ రహిత మచలము | భావాభావములులేని | బయలే అచలం |
కేవలాత్మయె అచలము | స్థావర జంగములులేని | సాక్షిరహితచలం

| సాధనరహిత | మోక్షాతీతచలం | ఆవరణ విక్షేప ఆరోప రహితచలం | నీవు నేననె భ్రాంతి నిరసనమే అచలం | సాక్షి రహితచలం | సాధన రహిత మోక్షాతీతచలం ||

6 పరిపూర్ణ మనగనెట్టి? పరిపూర్ణము యెక్కడుంది? పలుకుట కగునా ? పరిపూర్ణ మనగ వస్తువ ? పరిపూర్ణంబనినదాన్ని | పరగ జూచితివా? చూచితె నీవు మరిగి నిలచితివా? పరికించి వినజెప్పె పై మాటలకునెల్ల గురుపుత్రుడవైతె | గుట్టు దెలిసియుంటె | పరగా చూచితివా | చూచితె నీవు మరిగి నిలచితివా ||

7 పరిపూర్ణమనిన అచలము | యెరుకనగా యెరుక మరుపు | యెరిగెటిదన్నా | గురుతుగ | రెంటిని యెరిగియు | యెరుగక యుంటేనుచాలు | యెరుకుండదన్నా | మాట్లాడుటకు యేమిలేదన్నా | నిరతాము యీ రీతి నిష్టజెందినయపుడె | మరణా జననమూలానె మాయ భ్రాంతి దొలగు యెరుకుండదన్నా | మాట్లాడుటకు యేమిలేదన్నా ||

8 ఎరుకనగా యే వస్తువు | యెరుకనగా యెక్కడుంది ? యెంతటిది యదీ? యెరుకనగా యేర్పడినద ? యెరుకనగా యేమిలేదా ? యెరిగి చెప్పుమురా | చెప్పితే మేము యెరిగి వొప్పేమురా | మరుగుయిదే మూలమాయ దొలుగుటకు గురుపుత్రుడైతేను గుట్టు దెలసుంటేనూ | యెరిగి చెప్పుమురా | చెప్పితే మేము యెరిగి వొప్పేమురా ||

9 గురుతుగ అధ్యారోపమె | యెరుకయు విశ్వంబుగాగ | యేర్పడి యుండున్ | మరియపవాదము | నుంగన | నరుదెంచిన రీతి యెరుక | నరుగుచూనుండూ | తిరిగిరాక | గురుతులేకుండా | బరువడి సంపూర్ణ బయతే నిలచియుండూ | మరుగెరగినప్పడే మాయలేకయుండు | నరుగూచునుండూ | తిరిగిరాక గురుతులేకుండూ ||

10 గుర్తెరిగె శరీరంబని | నిరతము బలికెదవు యెపుడు | నితర జనులతో గురుతెరిగె తనువు ఎట్టిది | గురుతెక్కడ యున్నదదియా | గురిగా జెప్పుమురా ? యెరిగేతనువా | యెరిగి దెల్పుమురా | యెరుక మరుపులాను ? యెరిగేద ? యెరిగిందా ? యెరుగబడినద ? అది

యేర్పాడియున్నదా? గురిగా జెప్పుమురా | యెరిగే తనువా ? యెరిగె దెల్పుమురా ||

11 గురుతన ఎరుకనమాయె | హరిహర బ్రహ్మాదులన్న | అసురులు మాయే | గిరులన, తరులన, మాయే | మరి బ్రహ్మాండములు మాయె | మంత్రములు మాయే | వేదశాస్త్ర తంత్రములు మాయే | ధర పంచభూతములు వరజీవేశులు మాయే | పరిపూర్ణ మందూన | పరికించ లేవాయే | మంత్రములు మాయే | వేదశాస్త్ర తంత్రములు మాయే ||

12 మూలము లేదనియంటివి | మూలము యెటువంటిదదియు | మూర్తి యొకర్తో ? కాలమొ దేశమొ వస్తువొ? వాలాయము | పలుకో | అదియూ వాసిగా దెలుపూ | దెలసితె నీవు వర్ణించి నిలుపూ | కీలు దెలియక నీవు చాలావాదించేవు | మూలములేదాని మురసితె సరియగున | వాసిగా దెలుపూ | దెలశితె నీవు వర్ణించి నిలుపూ ||

13 కలగన్న జగము రీతియు | కలికయు కర్పూరమున్ను | గలసినరీతిన్ | దిలకింప యెరుక బయలులో | నిలకడగా యుండబోదు | నిజమింతేరన్నా | బయలును గనితా | నిలువాబోధన్నా | ఇలలోన యీ రీతి నెరిగి సద్గురు కృపన్ | చలనాము లేక నిశ్చలులై యుంటెనుదాలు | నిజమింతేరన్నా | బయలును గనితా నిలువాబోదన్నా ||

14 దృష్టాంతము ద్రాష్టాంతము | స్పష్టముగా యెరుకయనుచు సాధించిరి యీ | సృష్టి స్థితిలయమా? అది ! నిష్టలో ? మరియేమియుంది | నెరిగే చెప్పుమురా | దృగ్దృశ్యామా ? మరిగి తప్పకురా కరువుగండ మూలా? కాలత్రయంబూలా | నిరతాము జగములా | నిత్యా నిత్యములా | యెరిగె చెప్పుమురా | దృగ్ధృశ్యామా మరిగి తప్పకురా ||

15 దేనిని అద్వైతులుయిల | జ్ఞానముచే సాక్షియనుచు | గనుగొన్నారో దానినే ద్వైత విశిష్టులు | మానక మహావిష్ణువనిరి | మతములవారూ అనుభవమే పరమాత్మానినారూ | మానుగ వేదములలోన వేదాంతూలు | పూని బ్రహ్మానియన్న లేనెరుక యిదియన్న | మత మూలవారూ | అనుభవమే పరమాత్మానినారూ ||

16 యేమియు లేదనియంటివి | యేమది నీకెట్లు దెలిసె? యెట్లింటివదీ? సామెతెనా ? శాస్త్రంబా ? నీమంబా? నేస్తవంబా నెరుక పరచుమురా | తెలిసితేనీవు | అరమరుంచకురా | నామరూపనటన స్థోమజగజ్జాల | కామమోక్షములా ? కైవల్యపదవూలా ? యెరుక పరచుమురా | తెలిసితే నీవు అరమరుంచకురా ||

17 మతములవారలు సతతము | మితములచే వెతలుజెంది మేదినిలోనన్ హితవులు జెప్పుచునుందురు | మతి మంతుల మనుచుబల్కు | మాటలు విన్నా | మాయ భ్రాంతి మరిదొలగదన్నా శృతియుక్తి అనుభవ స్థితిరహితాచలబోధ | హితమూగ దెలిపి సమ్మతిపరచ నటువంటి | మాటలు విన్నా | మాయ భ్రాంతి మరిదొలగదన్నా ||

18 పలుకనిదే పరిపూర్ణము పలికినదే యెరుక యనుచు | పలుకబడెను యీా | పలుకే ఓంకారంబగు | బలుకనిదోంకారాతీత పరిపూర్ణమదిరా | దాపల బిందు బయలై యున్నదిరా | సురచిర వలపలసున్నావీడిన యెరుక | గురుతూగయుండీ | ఆ గురుతూ విడిచీయుండు | పరిపూర్ణమదిరా | దాపలబిందు బయలై యున్నదిరా ||

19 శంకలు దీరెను వినుమది | అంతెలలో ఒంటునొకటి | ఆత్మనబడునూ రంకుల బొంకుల జగమిది వంకలు లేనట్టి అచలం వాసీగగనుడీ | పై సున్నీడి వైకుంఠమనుడీ || దేశీకు శ్రీ వెంకటేశ్వరు కృపచేత | శాశ్విత పదవీలో శబ్దించకుండుడీ | వాసీగ గనుడి | పై సున్నీడి వైకుంఠ మనుడీ ||

20 సత్యము పరిపూర్ణంబు | యసత్యము యెరుకనుచు నెరిగి | సద్గురు కృపచే | సత్యముగా నీ యెరుకను | సత్యముగా విడచినపుడే | సాక్షుండదన్నా || సాక్షితో యెపుడు జగముండదన్నా | అక్షాయముగ యెపుడు అచలబోధను మదిలో | దీక్షాచే సాధించ దీరూను సంశయము సాక్షుండదన్నా | సాక్షితో యెపుడు జగముండదన్నా ||

21 వాదములేకను బోధను | సాధులతో వినిన మీాకు | సంశయముడుగున్, సాధనములెన్ని జేసిన | బాధలకేగాని ముక్తి | పదవీగాదన్నా యీా బోధతో సాటిరాదన్నా | సాధనలన్నింద్ర

జాలము లనియెరిగి | వేదాంతార్థాతీత విధము నెరిగితెచాలు |
పదవీగాదన్నా | యీ బోధతో సాటిరాదన్నా ||

శ్రీ భూమానంద హనుమంత రాజయోగిగారిచే రచియింపబడిన

పరతత్త్వ ప్రకాశిత కందార్థములు
సంపూర్ణము.

# భ్రాంతి రహిత తత్వములు

## 1 కీర్తన

రామా రఘుకులసోమా బిరాన రావా కామాకరుణాలలామ కాపాడలేవా ||

1 ప్రేమతో నిన్నెంత బిలచిన పలుకకున్నవదేమది | తామసమనాపైన
నేను తప్పుజేసినదేమది | యేమీ నేరమో దాచక తెల్పవేమీ
||రామా||

2 దీనరక్షక దశరదాత్మజ దిక్కునీవని నమ్మితి | దానవాంతక
ధర్మరక్షక దయకుపాత్రుడ నంటిని | గానా | లోలరావేల
నేతాళజాలా ||రామా||

3 పరమ పురుష పద్మనాభ పతితపావన పాహిమాం | నిర్వికార
నిరుపమాన నిర్మలాత్మక పాహిమాం | నిర్వి | శేష నిరంజన
నీరజాక్షా ||రామా||

4 హరేరామా హరేరామా రామరామ హరేహరే | హరేకృష్ణ
హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే రాధా | కృష్ణ గోవింద
శ్రీరామచంద్రా ||రామా||

5 వరములిమ్మని వేడలేదు చీరలిమ్మన లేదుగా | కరులనిమ్మని
పురము లిమ్మని సిరులనిమ్మన లేదుగా | ఘోరా రోగనివారణా
[illegible]మంటి ||రామా||

6 ధరలో మక్తల గ్రామమున నీదాసదాసుడనంటిని | దొరవు దాతవు

గురుడవని నా మొరను వినరమ్మంటిని | రావా హనుమయాఖ్యుని బ్రోవభారమేరా ||రామా రఘుకుల సోమా||

## 2. కీర్తన

1 అంజనిపుత్ర భవభంజన శ్రీ ఆంజనేయా ||అంజని||

సంజీవముబోసి ధర్మ సంరక్షణ జేయుమయ్య || వింజామరముల విసరి అంజలి జొసెదము నీకు ||అంజని||

2 రామాజ్ఞాను సీత కొరకు రావణ రాక్షసుల లంక | ధూమము గావించినావు సోమా రవిసురలు మెచ్చ || అంజని||

3 మంత్రగ్రహ భూతరోగ యంత్రము మహామ్మారిశక్తు | లంతా నీ దివ్య నామ మంత్రంబున మాడిపోవు || అంజని||

4 ధర్మము విడనాడి యితర ధర్మంబుల నడచునట్టి | దుర్మార్గులబట్టి యముని ధర్మంబుల కప్పగించు || అంజని||

5 భజియింతును వాయుపుత్ర భక్తితొ మనసందు యెపుడు | భజియింతును సూర్యమిత్ర బంధంబుల బాపరావ ||అంజని||

6 భక్తుడవై రాముల నా సక్తితొ పూజించి మాయ | శక్తిని దాటితీవన్న సర్వము బయలాయె నన్న ||అంజని||

7 ధర మక్తల పడమరదిశ స్థిరముగ నిలచున్నవాడ | అరమర జేయకను రావా హనుమాయాఖ్యుని బ్రోవ || అంజని||

## 3. కీర్తన

1 చల్లని తల్లీ ఓ నల్లాజానమ్మ రావె ||చల్లని|| యెల్లాలోకాల కల్పవల్లీ వేగమె భక్తా | యుల్లామందున జేరి మెల్లామెల్లాగబ్రోవ ||చల్లని||

2 ముక్కంటి దైవంబును మక్కువతో పెండ్లియాడి | పెక్కూరూపంబుల జగమెక్కువ గాపాడినావు ||చల్లని||

3 అష్టాదశ పద్మంబున ద్రష్టా స్వరూపిణివై | శిష్టాజనపరిపాలన దుష్టా సంహారణ జేయు ||చల్లని||

4 వేదంబులు నీపలుకులు వేదామాతవు నీవే | నాదాబిందుకళలు నాదీ బీజము నీవె ||చల్లని||

5 శుంశూమారమున చంద్ర సూర్యా తేజంబులునై | హంసై దేహముల యందు సంచారముజెయు నీవె ||చల్లని||

6 సిరులివ్వను చింతామణి పరమాపద మనగనీవె | సురమునిగణ నుత భూషిణీ నిరతము స్మరియింతు మదిని || చల్లని||

7 పంచమహా భూతంబులు పంచాదేవతలు నీవె | పంచావర్ణంబులకు పంచాక్షరములునీవె ||చల్లని||

8 పంచతన్మాత్రలూను పంచాశక్తులును నీవె | సంచితాదికర్మా ప్రాపంచంబను నీవె సుమ్మా ||చల్లని||

9 నొకరికి సంపద విద్యా నొకరికిసిరి రాజ్యంబులు | నొకరికి ధనమైశ్వర్యము నిక్కము నీ మహిమగదా ||చ||

10 అందంబగు నీ ధ్యానమె మందని మదినమ్ముకుంటి | మందులు తినితిని విసుకూ జెందితినిక చాలునమ్మ ||చ||

11 పెద్దా చెరువలుగు దిగువ ప్రేమతో నిలుచుంటివమ్మా | పెద్దా చిన్నలు జేరి ముద్దుగ బూజింతురుగదా || చ||

12 ధర మక్తల గ్రామంబున స్థిరవాసము జెసినావ | అరమర జెయకను రావ హనుమాయాఖ్యుని బ్రోవ ||చ||

## 4. తత్వము.

1 వినవెతల్లి కనకదుర్గా | మనవి చేకొనవేవమ్మా | అనుదినము నీనామస్మరణ మనము నెడబాయనమ్మా || విన||

2 చింతలెల్లను బాపుటకు చింతామణి నీవెనమ్మా | వంతుకెక్కిన శివుని రాణివి యింతపంతామేలమ్మా ||విన||

3 పింద బ్రహ్మాండములకెల్లను దండిశక్తివి నీవమ్మా | నిండుగా సహస్రా రమునను వుండి వెలుగైనావమ్మా ||విన||

4 పంచభూతముల పంచికరణము పంచకోశములీవమ్మా | పంచి యెంచను గొప్ప కొంచెము సంచితార్ధము నీవమ్మా ||విన||

5 తరులు గిరులు నరులు మృగములు సురలు నీవై నావమ్మా |

హరిహరా బ్రహ్మాది లోకము సురాసురులును నీవమ్మా ||విన||

6 సకల విద్యలు వేదశాస్త్రములు సకల మతములు నీవమ్మా | సకల
దేశములు సకల నీతులు సకల రూపులు నీవమ్మా ||విన||

7 ద్రష్ట దృక్కులు దృశ్య రూపము నిష్ఠలెల్లను నీవమ్మా | అష్ట
తనువులు అష్ట దిక్కులు సృష్టి లయములు నీవమ్మా ||విన||

8 యంత్ర మహిమలు యింద్రజాలము తంత్రము నీవేనమ్మా
మంత్రములు ఓంకార ప్రణవము మంత్రరాజము నీవమ్మా ||విన||

9 స్థూలసూక్ష్మ కారణులకు మూలమైయున్నావమ్మా | నీలతోయద
మధ్యమెరుపూ జాలమే నీ మహిమమ్మా || విన||

10 చూడజపతప ముద్రయోగము జాడనీవై నావమ్మా | గాఢతరమగు
జగయుగంబులు గూడినీవై నావమ్మా ||విన||

11 సత్తుచిత్తులు విద్యావిద్యలు మొత్తము నీవేనమ్మా | వృత్తి నాద
బిందు కళలకు విత్తువై యున్నావమ్మా || విన||

12 జ్ఞానమన నజ్ఞానమన సుజ్ఞానమన నీవేనమ్మా | ఘనముగను
ప్రజ్ఞానమన విజ్ఞానమన నీవేనమ్మా || విన||

13 ఇహముపరము బంధముక్తులు అహము నీవైనావమ్మా |
దేహిదేహము లనగ నీవె సోహమన నీవేనమ్మా ||విన||

14 ఎరుక మరుపులు సాక్షిమాయ గురుతుయన నీవేనమ్మా | స్ఫురణ
అంతఃకరణ జ్యోతి మరుగు మాటలు నీవమ్మా ||విన||

15 మొదలులేకను వచ్చితివి నీ మొదలు దెలియలేరమ్మా | కదలనిది
కలదనుచు నెరిగిన నీ మొదలు లేనెలేదమ్మా ||విని||

16 వున్నదని మరి లేదు అనుటకు కన్నతల్లివి నీవమ్మా | తిన్నగా
గురిజేరి గనగా సున్నయై పోతావమ్మా ||విన||

17 అందముగను కృష్ణాతీరము సుందరము బెజవాడమ్మా || యెందు
జూచిన భక్తవరలానంద పరవశులైరమ్మ || విన||

18 గట్టిగాను యింద్ర కీలమను గట్టుపైనున్నావమ్మా | దిట్టముగా

హనుమ యాఖ్యుడు నీ గుట్టు గురునిచే గనెనమ్మా ||విన||

## 5. కీర్తన

1 దారిద్రంబులు లేకపోవుటకు దారులు యిదుగో వినరండి |
ఘోరమైన సంసారవార్థిలో గూడిమునిగి చెడిపోకండి ||దారి||

2 ప్రొద్దునలేచిన తోడనెముందుగ ముద్దుగ స్నానము జెయ్యండి |
ఒద్దికతో మీ యిష్టదైవమును వదలక మదిలో దలచండి ||దారి||

3 పౌర్ణమి అమవాస్య దినంబుల పొందుసతులతో మానండి | పర
ధన పరస్త్రీ పరనిందాదులు పాపమునుచు నవి విడువండి ||దారి||

4 వట్టి తప్పులనుమోపి భార్యను కొట్టితిట్టపనిగాదండి | మట్టుగ
సంసారంబు దిద్దుకొని గుట్టుగ నుండగవలెనండి ||దారి||

5 ఇల్లు వాకిలి శుక్రవారమున అలికి ముగ్గువేయించండి | తల లంటుక
స్నానంబు జేయుమని యిల్లాలికి సెలవియ్యండి ||దారి||

6 మక్కువగా నామత్తు వస్తువుల నభ్యాసంబును మానండి | చక్కగ
జరిగే సంసారములో చిక్కులు గలుగును చూడండీ ||దారి||

7 జూదంబులు పెడవాదంబులు బహుబాధలు వచ్చును గనరండీ |
పెద్దల చెడిపి కొంపలుముంచే పెద్దతనముల మానండీ ||దారి||

8 భగవత్కార్యము లెన్నివచ్చిన భాగ్యములేదన బోకండీ |
భగవంతుడు మీకిచ్చినదానిలో భక్తితో దానము చెయ్యండీ ||దారి||

9 తల్లిదండ్రులే తొలిదైవంబని దలచివందనముజెయ్యండీ |
యిలమానవుడై పుట్టినందుకు ఫలమని మీమది దెలియండీ ||దారి||

10 అన్నదమ్ములతో పోరాటంబులు యెన్నటికిని తగదనుకొండీ | అన్ని
కష్టములకోర్చి ఓపికతో నున్న వాడెమొనగాడండీ ||దారి||

11 మత ధర్మంబుల వదలిన భ్రష్టుల గతిదుర్గతియని దెలియండీ |
సతతము దేవాలయముల కేగిసద్గతి నందగవలెనండీ ||దారి||

12 పండుగ దినముల కాలమునంతా దండుగా జేయగరాదండీ |
దండిగదైవా భజనలు జేయుచు నిండు మనసుతో నుండండీ ||దారి||

13 జూట సాక్ష్యము దొంగతనములా జోలికిమీరు పోకండీ |
చేటుగలుగు అపకీర్తి కార్యముల బాటదొలగి మీరుండండీ ||దారి||

14 యెంతవారి స్నేహంబుజేసిన నంతటివాడౌగదనండీ | యద్భావం
తద్భవతీ యనే శృతి అర్థ మబద్ధముగాదండీ ||దారి||

15 వసుదమక్తల గ్రామంబుననే వ్రాసితి యిట్లని వినరండీ |
పశుపతీశ్వరుడు హనుమాయాఖ్యుని పాలనజేయును పదరండీ
||దారి||

## 6. కీర్తన

1 నాపాలి శ్రీగురు నన్నేలరావా | ఆపాదలను దీర్చి కాపాడలేవా ||నా||

2 ఎంత నినువేడున యేమానవేమీ | పంతామనామీద పల్కావదేమి
||నా||

3 గొప్ప రోగము బాధ చెప్పలేనయ్యా | తిప్పలున్నవి చాలా
తప్పించవయ్యా ||నా||

4 దిక్కూ నీవేగతి దీనూడనన్నా | యెక్కాడవెదకిన యెవరులేరన్నా
||నా||

5 కోపామనాపైన తాపమస్వామి | దాపుజేరినవాడ దయరాదిదేమి
||నా||

6 పరిపారి విధముల ప్రార్థించుచుంటీ | కరుగాద నీమనసు
కఠినమేమంటీ ||నా||

7 నిష్టతో నినుదలతు నిజము నాతండ్రీ | భ్రష్టానష్టంబుల భయము
మాన్పండీ ||నాపాలి||

8 అందమౌనీధ్యాన మందుంటినప్పా | మందు తినితిని
విసుగుజెందితీనప్పా ||నా||

9 చిక్కే మీ చరణములు శ్రీవేంకటేశ | దక్కీతి భవనాశ దండవినాశ
||నా||

10 వసుధ మక్తల గ్రామా వాసూడనంటి | దోసీలొగ్గితి
హనుమద్దాసునేలంటి ||నాపాలి||

## 7. తత్వము

1 శ్రీ గురునీ శరణుజేయుదమా | వేగమే సేవ జేయుదమా | బాగుగా పూజ సల్పుదమా | అఘములన్ బారదోలుదమా ||శ్రీ||

2 తను మన ధనము లొసగుదమా | ఘనంబౌబోధ జెందుదమా | అనయ మీ యెరుక నొదలుదమా | జనన మరణముల బాయుదమా ||శ్రీ||

3 తనువులు శాశ్వితముగాదు | ధనము మనవెంటరాబోదు | లేని భ్రమల బడరాదు | గాన గురుపాద మిడరాదు ||శ్రీ||

4 గురువర భారమీదయ్యా | దురితముల్ బారదోలయ్య | పరునిగా దలచరాదయ్యా | పరమనే పదవి దెలుపయ్యా ||శ్రీ||

5 నరే నీకింక భయమేలా | మరీ నాపల్కు వినుబాలా యితరులబోధ విననేలా | వెరువక వినుము క్రమమూలా || శ్రీ||

6 మొదట నీకచల మెరిగింతు | పిదుప లేనెరుక చూపింతు | తుదకు ఆ యెరుకనిడిపింతు | మదికి ముమ్మారు నాటింతు ||శ్రీ||

7 కనుము ద్వాదశియే గలదనుచు | వినుము షోడశియు లేదనుచు | అనుము జగమంత మిధ్యనుచు | చనుము నేనీవు లేననుచు ||శ్రీ||

8 అప్పా నీ వింటివీబోధా | చూపగా కంటివాలేదా | మెప్పుగా నాటెనా లేదా | తప్పితె మళ్ళి వినుబోధా ||శ్రీ||

9 సారమౌ దీక్షితీయమురా | భారములేదు చూడుమురా | చింతలుమాని కనుగొనరా | అంత పరిపూర్ణ మిదాగనరా ||శ్రీ||

11 ధరలోశివ రామదీక్షితులు | మరియు శ్రీకృష్ణ దేశికులు | హరులు ఫీల్ఖాన లక్ష్మణులు | విరివిగా దెలిపిరీ ఘనులు ||శ్రీ||

12 శంకలు భాపె వినుమన్నా | వెంకటేశ్వరుల గనరన్నా | యింక భయమేమి హనుమన్న | అంతెనపల్లి స్వామన్న ||శ్రీ||

## 8. తత్వము

1 ఉన్నది గురుడన్నది నే | కన్నదంతటనున్నది | వున్నదేమోనున్నది నే నన్నదే లేకున్నది ||ఉ||

2 ఎరుక మరుపులు గానిది అది | యేకమైతానున్నది |
గురునిచేమేల్కొన్న వారికి | పరమపదమై యున్నది ||ఉ||

3 అండపిండము గానిది బ్రహ్మాండమేమన రానిది | దండిగా
అధ్యారోపపండితార్థము లేనిది ||ఉ||

4 మతమతంబులు గానిది | అది గతులకెన్నడు రానిది |
సతతముగురుసేవజేసిన | సాధులకె గురుతైనది ||ఉ||

5 జపతపంబులుగానిది అది | జన్మ రహితంబైనది | చపలులై
తిరిగేటివారికి | చెప్పశక్యము గానిది ||ఉ||

6 యాగయోగము గానిది అది భోగభాగ్యములేనిది |
జోగులుబైరాగులు అనె త్యాగులకు కనరానిది ||ఉ||

7 సాధనంబులుగానిది అది | బోధరూపంబైనది | మోదమలర
సమాధులచే సాధ్యంబు యెన్నడు గానిది ||ఉ||

8 ముద్రలయిదునుగానిది అది | ముదితయవనము లేనిది |
చిద్రరూపము గానిది అది | భద్రమై తానున్నది ||త ||

9 వేదశాస్త్రముగానిది అది | వాదభేదములేనిది | సాధనంబులు
యెన్నిచేసిన సాధ్య రహితంబైనది ||ఉ||

10 జ్ఞానాజ్ఞానముగానిది అది ఘనుల సాధ్యంబైనది |
స్వానుభావాతీతులకును సర్వసమరసమైనది ||ఉ||

11 పంచికరణము లేనిది అది | పంచశక్యము గానిది | సంచితము
లెడబాపు నట్టి | సద్గురు మహిమైనది ||ఉ||

12 మంత్ర మహిమలు గానిది అది | తంత్రమే లేకున్నది |
యంత్రతంత్రంబులకు అవల | స్వతంత్రమై తానున్నది ||ఉ||

13 బూటకంబులు గానిది అది | మాటలకు పైనున్నది | ఆటలకు
పాటలకు మీరియు | అంతటా తానున్నది ||ఉ ||

14 సత్తుచిత్తులు గానిది అది | వుత్తబయలై యున్నది | విత్తుచెట్టు
మర్మమెరిగితె | విశ్వమే లేకున్నది ||ఉ||

15 ఈశ్వరుండనరానిది అది | విశ్వరూపము గానిది | విశ్వతైజస ప్రాజ్ఞుల నెడు | వివరమేమియు లేనిది ||ఉ||

16 యాత్రలేమియు గానిది అది | పాత్రమెన్నగరానిది | ధాత్రిలో యీ సూత్రమెరిగిన దాతలకు వశమైనది ||ఉ||

17 స్థూల సూక్ష్మముగానిది అది | చూపురూపులులేనిది | కాలములుమూడింటి కావల | కర్మ రహితంబైనది ||ఉ||

18 ద్వైతమన్నది లేనిది | అద్వైతమెన్నగ రానిది | ద్వైవ అద్వైతముల మీరియు | దోష రహితంబైనది ||ఉ||

19 పిండరూపము గానిది | బ్రహ్మాండమన్నదిలేనిది | ఖండమగు పరమాత్మ ప్రత్యగాత్మలకు మీరున్నది ||ఉ||

20 అష్టదళములు గానిది అది | అష్ట దిక్కులులేనిది | సృష్టి స్థితిలయములకు అవల స్పష్టమై తానున్నది ||ఉ||

21 హంసరూపముగానిది అది | హింస యెన్నడులేనిది | సంశయంబులు లేక పరమ | హంస కావలనున్నది ||ఉ||

22 ద్వాదశి మంత్రార్థ మెరిగితె | దైవరూపంబైనది | సాధుజనులకు సమ్మతంబై | శాశ్వితంబై యున్నది ||ఉ||

23 షోడశి మర్మంబుదెలిసిన | శిష్యులకు యెరుకైనది | మూడు లోకంబులును ముగ్గురు | మూర్తులకు పైనున్నది || ఉ||

24 ధరలో శ్రీ శివరామదీక్షితు లెరుకపరచిన బయలది | గురుతుగాను భాగవత శ్రీ కృష్ణ గురువుల కెరుకది ||ఉ||

25 గురుతుగా ఫీల్ఖాన లక్ష్మణ | గురువు పుత్రుల కెరుకది | సరిగ చిత్తూరి వేంకటేశ్వర సాధు సమ్మతమైనది ||ఉ ||

26 ధరలో మక్తల గ్రామమందున | పరమ భక్తుల కొరకది | విరివిగాను హనుమయాఖ్యుడు | విశదపరచెను బోధిది ||ఉ||

## 9. తత్వము

1 వినరా చిదానందమయ్యా | మదిలో అనుమానించక నిజము వినజెప్పవయ్యా ||వినరా||

2 జ్ఞానమే శాశ్వితమంటే | ఆ జ్ఞానంబు సత్వమున జనియించె కంటే ||వి||

3 పుట్టింది గిట్టుననునట్లు | యిట్లు పుట్టేటి జ్ఞానంబు | గిట్టదనే దెట్లు ||వి||

4 జ్ఞాన మజ్ఞాన మన్నొకటె | ప్రజ్ఞాన విజ్ఞాన సుజ్ఞాన మన్నొకటె ||ఊ||

5 దేహి దేహములొకటెగావా | యిట్లు దేహము విడిదేహివున్నాదేత్రోవా ||వి||

6 నేను మేను వేరదెట్లు | యిట్లు నేనులేనిదె మేనుచేయు పనులెట్లు ||వి||

7 తన్నుతా నెరిగేది యేమి | అట్లు తన్నుతాను అవుతే | తనువు విడదేమి ||వి||

8 తనువసత్యము తా నిజమౌనా | చూడు | తనువు శర్కర బొమ్మకొంత చేదౌనా ||విన||

9 సాధనములు జేయవలెనా | యెట్టిసాధనంబులనైన పరము గననౌన ||వి||

10 అష్టదళములయందు గలదా | బ్రహ్మ, ద్రష్టయై లోపాల దాగున్నవాడా ||వి||

11 నిర్వికల్పము జెందెదేమి | యిట్లు నిర్వకల్పముజెంది నిలచుండెదేమి ||వి||

12 అనుభవమె ముఖ్యమేమన్నా | మోక్షమనుభవాతీతమని వినలేదేమన్నా ||వి||

13 యెరుకంతటా యున్నదేమీ | అట్లు యెరుకంతటయుంటె జూపరాదేమి ||వి||

14 మహావాక్యములును నాల్గంటే | వింటే అహము నేననే భ్రాంతివిడిచెదెట్లంటే ||వి||

15 సర్వంబు బ్రహ్మమైయుంటే | అందు వుర్వెట్లు గలిగెను చెప్పఎతెలిసుంటె ||వి||

16 శ్రీ శివరామ దీక్షితుల వారు | లెస్స భువిలోనచలబోధ నెగజల్లినారు ||వి||

17 భాగవత శ్రీకృష్ణ గురుడు | యిదుగో బాగూగ కందార్థములు వ్రాసెఘనుడు ||విన||

18 వెంకటేశవధూత స్వామి | నాదు శంకలెల్లనుబాపె యింక భయమేమి ||మి||

19 హనుమంత దాసుడోయన్నా | బోధ వినిపించు వింటె యిక జన్మలేదన్నా ||వి||

20 ధర మక్తల గ్రామమందుఅందు పరమ భక్తుల కెల్ల దెలిపె యీ సందు ||వి||

## 10 తత్త్వము

1 మెచ్చరూ తుచ్ఛుల మెచ్చరు | సుజ్ఞానులెపుడు మెచ్చరూ తుచ్ఛుల మెచ్చరు ||మెచ్చ||

2 మెచ్చరు యీ తుచ్ఛనరులను | అచ్చమైన బ్రహ్మవేత్తలు | పిచ్చి గురువుల జూచి భ్రమసే ముచ్చులను శివరామ యోగులు ||మెచ్చ||

3 అపు ఎడిపు ఎడనగరాకను | యెపు ఎదున్నా పరము దెలియక | కుప్పిగంతులు వేసి మేమే | గొప్ప యనగా అప్ప బ్రహ్మము ||మెచ్చ||

4 భూతలంబున నిజగురువులీ రీతిజెప్పిన మాట వినకను | కోతివేషలనమ్మి జన్మకు హేతువులను సీతారాములు ||మెచ్చ||

5 స్పష్టముగ ద్వాదశియు షోడశి | సద్గురునిచే దెలియలేకను | అష్ట యోగములందు చిత్రము | లిష్టముగ జేయంగ కృష్ణులు ||మెచ్చ||

6 మేలిమిగను అఖండభావము లీలగా గురుకీలు దెలియక | చాల వాదము లాడు వారిని పీలుఖాన శంకరార్యులు ||మెచ్చ||

7 దీక్షితుల పరిపూర్ణ బోధచే | మోక్షమని గురుతెరుగలేకను | సాక్షిమాత్రంబైన కళనే మోక్షమనినను లక్ష్మణార్యులు ||మెచ్చ||

8 శంకదీర్చునట్టి దేశికు | వంకజేరి వుపము లెరుగక | సంకరంబగు మతములచే శంకించువారిని వెంకటేశులు || మెచ్చు||

9 ఘనముగను యీ అచలబోధను | ఘనులచే యెరిగెరుక విడువక జనన మరణ ప్రవాహామునబడి చెడెడివారిని గహామయార్యులు ||మెచ్చురు||

## 11. తత్వము

1 తత్మమూలు జదువగానే ధన్యులైనారా | మీతామసాది గుణములెల్లా తరిమివేశారా ||తత్వమూల||

2 భజనలు బహూ సేయగానే భక్తులైనారా | మీ బంఢ గుణమూలనెల్లా చెండివేశారా ||తత్వ||

3 నామమూలు దిద్దగానే స్వాములైనారా |మీ| కామ క్రోధగుణములెల్లా కాల్చి వేశారా ||తత్వ||

4 జడలు గడ్డము లుంచగానే జాణలైనారా |మీ| జారచోర గుణములెల్లా జంపివేశారా ||తత్వ||

5 వ్రతములు బహూసేయగానే గతులు గన్నారా |మీ| పతిత పావనమైన సత్యా పథము గన్నారా ||తత్వ||

6 యాత్రలు సేవించగా పావిత్రులైనారా |గొప్పా| సూత్రమూను కన్నూలారా జేదియున్నారా ||తత్వ||

7 మెప్పుగా విభూతిబూసి అప్పులైనారా |మీ | తప్పులన్నీ సాక్షితోడ వొప్పుకున్నారా ||తత్వ||

8 పూజలు బహూసేయగానే పుణ్యులైనారా | మీరు| పూజజేసే గురుని మహిమా పొడచికన్నారా ||తత్వ||

9 వేదమూలూ జదువగానే సాధులైనారా |మీరు| సాధనములులేని నిజగురు బోధవిన్నారా ||తత్వ||

10 ముద్రలు సాధించగానే ముక్తి గన్నారా |మీరు| భద్రమైన బయలుదెలిసీ పలుక కున్నారా ||తత్వ||

11 వెషమూలు వేయగానే వేత్తలైనారా |మీ| ఆశపాశబంధములనూ గోసియున్నారా ||తత్వ||

12 కోరికోరి పేరు కొరకు గురువులైనారా |గొప్ప| వారివద్దా చిలుక పలుకులు వదులుకున్నారా ||తత్వ||

13 హనుమయాఖ్యుడు వ్రాసెననుచూ అలిగిపోతారా |మీరు| ఘనులజేరి నిజము దెలిసి కలుసుకుంటారా ||తత్వ||

## 12. తత్వము

1 కన్నవారా లేక విన్నవారా నిజము ||కన్న||
తిన్నాగ సద్గురు సన్నిధిలోజేరి ||కన్న||

2 తన్నుతాననకాను యెన్నా శక్యముగాక | వున్నా పరిపూర్ణ మీ కన్నులతో మీరు ||కన్న||

3 పలుకూల కందాకే తలపూ లెరుంగాక | కలకాల మొకరీతిగల బ్రహ్మమంతటా ||కన్న||

4 యెండామావులరీతి నుండే బ్రహ్మోండాము | ఉండీన పోయిన రెండూ యెరుగనిదాన్ని ||కన్న||

5 అన్నిటి నెరుగూచు నున్నా యెరుకను బట్టి | సున్నాజేసి పై నున్నా పరమాత్మాను ||కన్న||

6 ధరలోన వెంకటేశ్వర దేశికులచేత | సరిగా హనుమద్దాసు లెరిగీన పరమూను ||కన్న||

## 13. తత్వము

1 వినరయ్యా యీ అచలబోధను | వినసొంపుగనున్నా | వినినను కను సొంపై యున్నా | వినికనినను మీ జనన మరణముల బాధ దలగునన్నా | మానవ జన్మకు ఫలమన్నా ||విన||

2 మతములవారలు తమసమ్మతముగ మితములు యేర్పరచి | శాస్త్రముల శృతులను యేర్పరచి | గతులు గానకా వెతలుజెందిరా స్థితిని దూరపరచి | సతతము నమ్మకు మదితరచీ ||విన||

3 అంతటనిండియు ఆది మధ్యమున అంత్యము లేదన్నా | సర్వ
పరిపూర్ణముతానన్నా | చింతలేక శ్రీ సద్గురు చరణము
చెంతజేరుమన్నా | అంతునీకు తెలియజేయునన్నా ||విన||

4 యజ్ఞ యాగములు క్రతువులు జేయుదు | రజ్ఞులు భువిలోనా |
యింద్ర భోగంబుల భ్రమలోనా | ప్రజ్ఞలనుచు సుజ్ఞానులు మెచ్చరు
నమ్మకు మదిలోనా | యజ్ఞమన హింసగాదెకూనా ||విన||

5 మంత్ర మహిమలు మది చంచలములు | తంత్రములవియెల్లా |
జన్మము కడతేరుటకల్లా | యింద్రజాల మహేంద్రజాలములు
పంచముద్రలెల్లా | యంత్ర సూత్రంబులు జగమెల్లా ||వినా||

6 జపములు తపములు యెన్నిజేసిన జాడదెలియరాదు | పరము
ప్రత్యక్షము తాగాదు | విపరీతపు యీ విద్యలచాతను
చపలత్వముబోదు కపటవేషంబుల బడరాదు ||విన||

7 వేదభాష్యములు చదువచదువగా వాదులధికమైరి | సత్యమును
దెలియ దూరమైరి | వాదులనోటికి బూడిదయని వేమన్న జెప్ప వినిరి
గాథలో బడి తప్పక చెడిరి ||విన||

8 స్పష్టముగాను అష్టదళంబున దృష్టిలయంబగునా | జీవ
బ్రహ్మైక్యము తానౌనా | సృష్టి స్థితిలయ క్రమముల నెరుగక
శ్రేష్టించదగునా భ్రష్టులైపడిరి భ్రాంతిలోనా ||వినా||

9 సకల దేశముల సకల కాలముల సకల వస్తువులయందు |
నిండున్నదేదోకనుముందు | వికటమైన యీ యెరుకనంతటా
యెరిగివిడువు మనసందు | గురుముఖమునగను యీ సందు ||విన||

10 ద్వాదశి షోడశి మంత్రార్థంబుల మర్మమెరుగవలెను | యెరిగి
సాధన్యుడు కావలెను | వాదభేదములుమాని సర్వవిధ
వాంఛలుడుగవలెను చూడు బ్రహ్మాండము కలవలెను ||విన||

11 నేప్రణవంబువు నేసర్వంబును నేనె సాక్షియనరాదా | విజ్ఞానదశను
విన లేదా | నే ప్రజ్ఞానము నాల్గు వాక్యములు నేనె నేనె యనరాదా
యివి యెల్లమాయనే కాదా ||వినా||

12 స్థిరముగాను శివరామదీక్షితుల భావము గనరండి | భాగవత

కృష్ణుడెరిగె నండి | విరివిగాను శ్రీవెంకటేశ్వరుడెరిగె మర్మమండి |
తెలిపె హనుమంత యోగికండి ||వినరయ్యా||

## 14. తత్వము

1 అందునా బోధ అందునా | అజ్ఞానులకు మదికందునా ||బోధ||
అందునా యీ అచలబోధ పొందుగా సద్గురునిసేవా | నందముగ
సల్పం గనేరని మందమతులై నట్టివారల ||అందు||

2 వేదములు నాల్గారు శాస్త్రము చదవి సర్వంబెరిగినామని | వాదములు
జేయుచు వెర్రిగాథలోబడి గొనుగువారికి ||అ||

3 జపతపంబులు యజ్ఞయాగము లపరిమితమగు మంత్ర మహిమలు |
కపట వేషంబులనుదాల్చి చపలులై తిరిగేటి చనటుల ||అ||

4 అంగమున లింగంబు శివుడని పంగనామమే రంగడనుచును |
పొంగుచును మతగర్వమున నిజసంగ తెరుగని దొంగలకుమది||అ||

5 సతతము గురు సేవజేయక | మతము అభిమానంబు వదలక |
గతులు గానక వెతలుజెందే పతితులకు పాషండులకుమది ||అ||

6 దేహి దేహంబులకు మధ్యన సోహమని పలికేటి హంసను |
ఊహచే పరమాత్ముడనిమది మోహము జెందేటి మూర్ఖుల ||అ||

7 మూలములేనట్టి మాయ తోలుబొమ్మ కీలు దెలియక | చాల
తర్కముజేసి తుదకెమ పాలబడి చెడె పామరులకు ||అ||

8 యెండమావుల జలమురీతి నుండే యీ బ్రహ్మాండమంతయు | దండి
కలయని యెరుగజాలక తిండికై తిరిగేటివారికి ||అ||

9 తనుమనో ధనములను మూటిని వినయముగ శ్రీగురుని కొసగక |
అనయ మహంకారవశులై తనువు భ్రాంతులు విడనివారల ||కం||

10 యీషణత్రయపాలమున దుర్వాసనత్రయమందు మునుగుచు |
వేషభాషలు రోయకను తమ ద్వేషములు విడలేనివారల ||కం||

11 అచ్చమైన బ్రహ్మవేత్తల స్వచ్ఛముగ తానెరుగలేక | హెచ్చుగాను
పిచ్చి వారిని మెచ్చితిరిగే తుచ్ఛనరులకు ||కం||

12 వున్నదని ద్వాదశియు లేదని యన్నషోడశి యనుచు దెలియక |
తన్ను తనలో తెలియుమనెడి భిన్నకూతల పిన్నలకుమది ||కం||

13 వాసిగను మక్తాల గ్రామ నివాసుడను మందిప్పలనుమద్దాసుడీకృతి
జేసినాడని రోషమందిన దోషకారుల ||కం ||

## 15. తత్వము

మీకే మంచిది మంచిదీ | గురుభక్తినున్నా | మీకే మంచిది మంచిదీ ||

1 మీకే మంచిది భక్తికి | మించినా వేరుక్తిలేదు | రాక పోకలులేని
రాజమార్గమైన బోధవింటె ||మీకే||

2 ప్రొద్దునా నిద్దారలేచి వద్దికి యేతెంచిగురునీ ఒద్దికతో దర్శనము
జేయుట | బుద్ధిమంతుల మొదటిపనియగు ||మీకే||

3 గురుని దర్శన మాత్రమూన | కూలిపోవును జన్మ బంధము | అరసి
గురుడూ స్పర్శజేయ | యఘములెల్లా బాయునిజముగ ||మీకే||

4 వందనాది క్రియలవల్లా నందముగ సమకూరుయశమే | మందు
భక్తితోడ మోక్షామందిరీ ముసు భక్తులంతా ||మీకే||

5 వేంకటేశ్వర స్వామికృపచె జంకులెల్లను దీరెననుచూ | శంకలేకను
దెలుపనాయె వంకలేని యచలబోధా || మీకే||

6 శ్రీ శికింద్రాపురమునందున | వాసిగానెలకొన్న సద్గురు | దాసుడగు
యీ హనుమయాఖ్యుడు వ్రాసెనని విశ్వాసముంచిన ||మీకే||

### శ్రీ శివరామదీక్షిత గురుపీఠ మంగళ హారతి

హారతిదుదో | మంగళ | హారతిదుగో ||హార||

1 హారతిదిగో జగతియందున | అచల పరిపూర్ణాత్మ తత్త్వ |
విచారులగు సాందీప మహాఋషి | స్వాములకు శ్రీ కృష్ణునకును
||హార||

2 పండరీ పురమందు నిలచి | భాగవత భగవద్గీతలు | అఖండముగ
భక్తులకు దెలిపిన | కారణుండగు శ్రీధరేంద్రుల ||కార||

3 వాసిగా బృహద్వాసిష్ఠము | వ్రాసినారాయణ పురంబున |

దేశములలో ప్రకట పరచిన దేశికులు శివరామదీక్షితుల ||కార||

4 స్థిరముగను కంబాలూరి పురమునందున అచలబోధను |
మురయుచును భక్తులకు దెలిపి ముక్తి నొసగిన అప్పారావుకు
||హార||

5 పరమపావనమైన యెరగొండ | పాళెమున భద్రాద్రిరామ |
పరమశతకము వ్రాసినట్టి | పరశురామ నారసింహుల ||కార||

6 మరియు నా పాళెమున నిలిచి | పరమతత్వము బోధపరచిన |
పరశురామ వంశభవశ్రీ | ప్రభువు సీతారాములకును ||హార||

7 దక్కన్ హైద్రాబాదులోపల | మక్కువతొ కందార్థ కందముల్ |
చక్కగను రచియించినట్టి | సద్గురువు భాగవత కృష్ణున ||కార||

8 దీక్షతో నాంపల్లియందున | దివ్యముగ గురుగీత అచలము | సాక్షిగా
భక్తులకు దెలిపిన | స్వామిఫీల్ఖాన శంకరున ||కార||

9 మేలిమిగను బేగంపేటలో | చాలగా పరతత్వములు గురు |
బాలులకును బోధపరచిన ఫీలుఖానా లక్ష్మణార్యుల ||కార||

10 ధరను శ్రీ శివరామ దీక్షిత గురుపీఠ వేదాంత గ్రంథము | లెరుక పరచే
వేంకటేశ్వర పరమయోగికి భక్తులకును ||హార||

11 అందమౌ మందిప్పలా వంశాబ్ది చంద్రుండనగభూమా | నంద
హనుమ ద్దేశికేంద్రుం | డయిన నిజగురు రాజయోగికి ||హార||

12 వాసిగా పొన్నాల వంశమునందు | వెలసియు గురుని సేవ | జేసి
ఎరుకను వీడి భక్తుల | గాసిబాపె రాజయోగికి ||హార||

13 మరియును పీఠస్తులకును | పరమతత్వ విచారులకును | నిరతము
వేదాంత సభలో | నిలకడైన సాధువులకును ||హారతి||

## మంగళహారతి

1 శ్రీకరంబైనట్టి ఓంకార పీఠమున | ప్రాకటంబుగ హారికి |
భానునకును, ఏకముగ వెలిగేటి | యాజ్ఞవల్క్యకి మరియు | జోకతో

రాజఋషి జనక పతికీ | జయమంగళం | నిత్య శుభమంగళం |
జయతు జయమంగళం | హోత్సవ మంగళం ||

2 శుద్ధ తత్వజ్ఞుడౌ శుకయోగికిని నిత్య | సద్ధర్మ మార్గుడౌ
సొందిపునకు | సిద్ధముగ పూర్ణుడౌ శ్రీకృష్ణమూర్తికిని | ఒద్దికతో
అర్జున యుద్ధవులకు ||జయ మంగళం||

3 శ్రీమించి వెలిగేటి శ్రీధరస్వామికిని ధీమించు శివరామ దీక్షితులకు
కామి తార్థములిచ్చు ఘన అప్ప బ్రహ్మకు | వేమారు శ్రీ సీతా
రాములకును ||జయమంగళం||

4 పరిపూర్ణ బోధను ప్రకటపరచినయట్టి | వరభాగవత
కృష్ణగురునికిపుడూ | నిరతంబు పరతత్వ మెరిగించె షీల్ఖాన | వర
లక్ష్మణ ప్రభు చరణములకూ ||జయమంగళం||

5 గురుతుగా ఓంకార గురుపీఠ సిద్ధాంత | పరమ తత్వార్థము
భక్తులకునూ | కరుణతో బోధించి కడతేర్చినటువంటి | వర
వేంకటేశ్వరా గురుని కిపుడూ ||జయమంగళం||

6 అనుమానములులేక నచలబోధను దెల్పి | జనన మరణ భ్రాంతి
జడుపు దీర్చి | పనిబూనుకొని గురు భక్తులను దరిజేర్చె |
హనుమంత సద్గురు ఆర్యులకును ||జయమంగళం||

7 ధరరాజ యోగమున దండిగా విలసిల్లి | శరణు బొందిన సుజన
సంఘములకు | పరిపూర్ణబోధను కరుణచే నొసగుశ్రీ | వర
రాజయార్య సురవందితునకు ||జయమంగళం||

## మంగళమివరే

1 మంగళమివరే మన గురుమూర్తికి | అంగనలందరు గుమిగూడి |
సంగరహిత నిస్సంగుడైన గురు | పుంగవుడేగతియని వేడి
||మంగళ||

2 పాదంబుల కభిషేకము జేసియు | పరిమళ గంధంబులతోడ |
సాధుపోషకుని షోడషోపచా | రాదుల పూజింపరెవేడి ||మ||

3 పారిజాత చామంతి పుష్పముల | హారంబులు మెడలోవేసి |
తీరుతీరుపన్నీరు అగరుక | స్తూరి రేఖ నుదుటనుదీర్చి ||మ||

4 ధూపదీపనైవేద్యంబులు సం | తోష మొంద విడియములొసగి |
పాపములన్నెడ బాపుమనుచుమది నోపి దక్షణములర్పించి ||మ||

5 సందులేనిదే పరిపూర్ణంబని ముందుగ నెరగించియు మనల |
కెందులేని యీ యెరుక మాన్పెను | యేది యింక జన్మము మరల ||మ||

6 వేయుడి యిగతణభేరి గురునికి | లెరిగేవారలు యిలమీద | మాయనే
లేదని చాటుడింక అను | మాన రహితమౌ యీ బోధా ||మ||

7 ధరలోపల శికింద్రపురంబులో | దయానందుడై సుజనులనూ |
కరుణ జూచె పొన్నాల రాజయా | గురునకు వందనమనియనుమూ ||మ||

8 యెంత మనోహరమే గురుబోధలా | యెరుక భ్రమలు వేగమెవీడా
వింతగాదె యీ వీరచార్యుల | వెతలుదీర్చె చాలగవేడా ||మంగళం||

సంపూర్ణము.

శ్లో || అద్వైత రహిత సిద్ధాంత | భ్రాంతి రహితోపదేశిక
పొన్నాల రాజయోగీంద్ర | సద్గురోతే నమోనమః ||

శ్లో || ద్వయాత్మదోషరహిత | కేవలాత్మ సత్స్వరూపకం
భూమానంద హనుమయార్య | పాదకమల సేవకం
పూర్ణబోధ సద్విచార | రాజయోగవర్తనం
దయానంద రాజయార్య | సద్గురుం భజామ్యహం ||

శ్లో || పొన్నాలవంశ కలశాంబుధి కైరవాప్తమ్
పూర్ణందయానిధి మనంతగుణైకదిష్టం |
రాజాధిరాజ మకుటాంచిత రత్న సేవ్యం |
శ్రీరాజయోగి గురుమంతరతో నమామి ||

శ్లో || అస్మద్గురు సమారంభాం | కృష్ణసాందీప మధ్యమాం
శ్రీ మహావిష్ణు పర్యంతాం | వందేగురు పరంపరామ్ ||

-(లఘుపూజ)-

శ్లో|| బ్రహ్మానంద పరమ సుఖదం | కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం | తత్త్వమస్యాధి లక్ష్యం
ఏకం నిత్యం విమలమచలం | సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం | సద్గురుం తంనమామి ||

శ్లో|| ధ్యానమావాహనం సింహా | సనం పాద్యం తథైవచ
అర్ఘ్యమాచమనీయంచ | స్నానం పంచామృతైస్సహ||

శ్లో|| శుద్ధోదకం వస్త్రయుగ్మం | యజ్ఞసూత్రం విభూషణం
విలేపనంచాక్షతాంశ్చ | పుష్పం స్వర్ణ వినిర్మితం||

శ్లో|| ధూపదీపంచ నైవేద్యం | పానీయం ఫలమేవచ
తాంబూలందక్షిణార్తిక్యం | మంత్ర పుష్పం ప్రదక్షణం|

శ్లో|| నమస్కారం దేశికేంద్ర | మయాతుభ్యం నివేదితమ్
కృపయాగృహ్యతాంస్వామిన్ | న్యూనాధిక్యం నచింతయ||

శ్లో|| లఘుపూజా విధింభాగ | వతకృష్ణద్విజన్మనా
రచితంశోతృవక్తౄణా | మిదంమోక్ష కరంపదం||

శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయకపీఠ
గ్రంథములు వలయువారు.

పొన్నాల అనసూయాంబ
అచల గురు పీఠము.

నెం 4-1-96, రాజయోగాశ్రమము సికింద్రాబాదు
ఆంధ్రప్రదేశ్.
అని వ్రాయవలయును.

ముద్రణ : లావణ్య ముద్రణ, బెంగళూరు 560 050